సాధన గ్రంథ మండలి - 70.

# నేపాల యాత్ర

(పశుపతినాథము)

★

రచయిత

విద్వాన్. బులుసు సూర్యప్రకాశశాస్త్రి



ప్రకాశకులు :
సాధన గ్రంథ మండలి, తెనాలి.



1958

# PREFACE

Nepal, an independent state, situated on the north eastern frontier of our land acquired a very important place on the religious map of India. Many Indians specially Hindus feel that their spiritual quest is incomplete without a piligrimage to Nepal and the Darshan of Lord Pasupatinatha, It is the ardent belief of all the Hindus that Lord Pasupatinatha is Siva Himself resting on the banks of the river Bhagmathi, in the vicinity of Khatmandu, the Capital.

Nepal with an area of 54,000 square miles, population of about 84 lakhs and a temperate climate remains a place of eternal attraction to tourists from all over the world with its enchanting valleys, beautiful forests and Majestic Himalayan peaks such as Mount Everest (29,141 feet) Kanchanganga (28,140 feet) Makalu (27,790 feet) Dhavalagiri (26,800 feet) and Gauri Shankar (23,440 feet) and with places of Piligrimage such as Janakapur, Viswamitra Mandir, Varahakshetra, Dhanush Basti, Sita Mahi, Guhyeswari Mandir, and Mukthinatha on the banks of Gandaki.

The Nepalese people, who are of mixed Mongol origin with distinct influence of Indian strains, composed of Bhotias, Newars, Gorkhalis, Kirantis, Limbus and Lepchas, Brahmans and Chatris follow the Hindu and Buddhist faiths,

My humble endeavour to create a lively interest among the Telugu speaking devotees in the glory of Lord Pasupathinatha has found its expression in the form of this book which is the first of its kind in any Indian language specially in Telugu.

I am very happy to record my grateful thanks for the help I have received from the Government of Nepal specially from the directorate of Information and Public Relations, Khatmandu, who have very readily and willingly supplied the required material photographs and other valuable information for my use. This generous co-operation on their part is a clear indication of the value and esteem, with which they look upon such efforts as the publication of this book.

I also want to express my most sincere gratitude to my esteemed friend Sri V. Bhanumurty (Assistant Information Officer, Press Information Bureau, Government of India) for the spontaneous and keen interest he has evinced in enabling this book rich in information and illustrations, to be brought out in the present form.

SADHANA GRANDHA MANDALI, TENALI. B. Suryaprakasa Sastry Author.

# విషయసూచిక

## దేవతా ఉత్సవములు - పూజలు



### ముక్తినాథము



### సింహావలోకనము

శ్రీ శివాయ గురవే నమః



నమశ్శివాయై చ నమశ్శివాయ.

# సమర్పణ

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యాం,
నగేంద్ర కన్యావృష కేతనాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీభ్యామ్.

సంసార సర్పదష్టానాం జంతూనా మవివేకినామ్,
చంద్రశేఖరపాదాబ్జ స్మరణం పరమౌషధమ్.

పరశివుని అష్టమూర్తులలో యజమాన మూర్తియై వెలుగొందుచున్న శ్రీ పశుపతినాథుని పాదపద్మములయందు ఈ గ్రంథము సమర్పించుచుంటిని.

— రచయిత.

# వి న తి

ఈ బ్రహ్మాండ మంతకును ఆధారభూతము ఒక్కడే. జీవులను తరింపజేయుటకుగాను భగవంతుడు విభిన్న రూపముల దాల్చెను. అట్టి విశ్వవిరాట్స్వరూపుని విభిన్న నామములతో భారతదేశము నలుమూలల వేలాదిగ తీర్థక్షేత్రములు గలవు. అన్యదేశములలోగూడ నాయన విశ్వజ్యోతి బహుముఖముల వ్యాపించియున్నది.

పరాత్పరుడగు పరమేశ్వరుని అష్టమూర్తులలో నొకటియగు యజమానరూపము పశుపతినాథుడనుపేర నేపాలదేశమున వెలసియున్నది. ఈ పశుపతినాథుని చరిత్ర, నేపాలదేశ సహ సౌందర్యము తెలుగున ప్రకటించవలయునను చిరకాల వాంఛిత ఫలస్వరూపమే ఈ నేపాలయాత్ర.

ఈ గ్రంథము యీరీతిగారూపొందుటకు నేపాలురాష్ట్ర అధినేతలు, యాత్రికసమాచారశాఖాధికారులు కోరినట్లోడనే సర్వసమాచారము చిత్రములు, మార్గదర్శక పటము పంపి సహకరించిరి. వారికి నా కృతజ్ఞతలు. ముఖ్యముగా నీ గ్రంథమింత సర్వాంగసుందరముగా యవతరించుటకు సర్వవిధముల సహకరించిన మా మిత్రులు, సోదరులు అగు శ్రీ వేమరాజు భానుమూర్తిగారికి కృతజ్ఞతాపూర్వక శుభాశీర్వచనములు.

కాగితపుధర విపరీతముగా పెరుగుటచే గ్రంథ ప్రచురణ విషయమై మండలిలోజరిగిన కాలహరణమును మన్నించి మండలికృషిని అభిమానించుదురుగాక యని మండలి పోషక వర్గమునకు మనవిచేయుచున్నాను.

విలంబి కార్తికము
తెనాలి.

గ్రంథకర్త
బులుసు సూర్యప్రకాశశాస్త్రి

# అవతారిక

నేపాల్ యాత్ర బహుదుర్ఘటమైనదని ప్రతీతి. ప్రతీతి యేమి నిజమేకూడ దేశము పర్వతప్రాకార పరివేష్టితము, దుర్గమము. సందర్శనము బహు వ్యయప్రయాసైకసాధ్యము. విమానములున్నవి కాని, అవి అందరికి అందుబాటులోనున్నవా? కాలినడకను ఖాట్మాండూనగరము చేరుకోవలెనన్న ఏళ్ళు పూళ్లు పట్టును. అదియును అందరకును సాధ్యమా? దానికెంత సంకల్పబలము కావలెను? కష్టసహిష్ణుత కావలెను? అసలు పశుపతినాథుని కనులపండువుగ గాంచనినాడు, ఆత్మార్పణ పురస్సరముగా ఆయన పాదపద్మములకు సాష్టాంగ నమస్కారము చేయనినాడు మన యాత్ర పూర్ణయాత్ర కాజాలదు. కాని ఇది సాధన గ్రంథ మండలి శాస్త్రిగారి సాధనమున అందరికీ అందుబాటుగా పరిణమించిన ఈ పని ఉభయతారకమైనది. భౌతికముగా కాలు గడప దాటజాలనివారికి సైతము పశుపతినాథుని పవిత్రానుగ్రహప్రసాదమును లభింపచేయుటకు పూనిన పూనిక ఫలితము ఈ గ్రంథము.

పశుపతినాథుడు సాక్షాత్తు పరమశివుడేనని ముముక్షువులైన సర్వభారతీయుల విశ్వాసము. విభిన్న భాషలకు, మతములకు నిలయమైన యావద్భారతదేశములోను ప్రతివారిని ఆత్మీయులుగా చేయు భారతసంస్కృతీ మహోజ్జ్వలచ్ఛాయలు మనకు ఖాట్మండు పరిసరాలలో భాగ్మతీ ఒడ్డున వెలిసిన పరమశివుని ప్రాంగణంలో సైతం కనుపించి పులకరింపచేయగలవు.

సతత సుఖదాయకమైన సమశీతోష్ణపరిస్థితి, ఎవరెస్ట్, కాంచనగంగ, మకాలూ, ధవళగిరి, గౌరీశంకర్ వంటి హిమాలయోత్తుంగ శృంగాలు పర్యాటకులకు నిత్యాకర్షకాలు.

జనకపురం, విశ్వామిత్ర మందిరం, వరాహక్షేత్రం, ధానుష్‌బస్తీ, సీతామహి, గుహ్యేశ్వరీ మందిరం, గండకీ తీరాన గల ముక్తినాథక్షేత్రాలు ముముక్షువులైన తీర్థయాత్రాచరణశీలురకు అవశ్యసందర్శనీయాలు.

నేపాల్ ప్రజలు సరసులు, స్నేహపాత్రులు. స్నేహశీలురు, సహృదయులు. సుదృఢగాత్రులు. రసపిపాసువులు. కళలలో నేర్పరులు. వీరవతంసులు. శౌర్యనిధులు.

పశుపతినాథుని ఉనికిచే పవిత్రమైన నేపాల్ దేశమును గురించి తెలియచెప్పాలనే తపనతో సాధన గ్రంథ మండలి సంస్థాపకులు చేసిన అనవరతకృషి. ఫలితమే ఈ ఉద్గ్రంథము. దీని ఘటము చిన్నది. ఘటన గొప్పది.

ఆంధ్రదేశంలో బులుసువారు బహుప్రసిద్ధులు. ఆధ్యాత్మికసాధన సంపన్నులు. యజనయాజనాది షట్కర్మనిరతులు. నిరతాన్నప్రదాతలు ఆధ్యాత్మికసాధన వాఙ్మయానికి, ప్రచురణకు సాధన గ్రంథ మండలి సంస్థాపకులు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు, వీరి సాధన గ్రంథ మండలి కాణాచి. ఆంధ్రదేశంలో బులుసు లేని యజ్ఞం లేదు. బులుసువారి ముద్ర లేని సాధన లేదు. వీరు చిరంతనమైన ఆర్ష విజ్ఞానపు నిరత ప్రదాతలు.

కన్యాకుమారి మొదలు కాశ్మీరు వరకు సకలదేశ వ్యాప్తములైన వందలాది హిందూ, జైన, బౌద్ధ, క్షేత్రములను, నదీనదములను, పర్వతశృంగములను సరళమనోహరమైన భాషలో పరిచయముచేసి ముముక్షుయాత్రికు లందరచే సుఖకరముగ సుందరభారతయాత్ర చేయించి పుణ్యము కట్టుకొన్న శ్రీ శాస్త్రిగారు – ఇప్పుడీ గ్రంథముద్వారా భక్తులకు సులభుడు, బద్ధకస్తులకు దుర్లభుడు అయిన పశుపతినాథదేవుని పవిత్ర సందర్శనభాగ్యమును అందరికి కలుగజేయుచున్నారు. ఉన్నంతలో సర్వాంగసుందరముగా నేపాల్ చరిత్ర ఆంధ్రమున ఇదే ప్రథమగ్రంథమని చెప్పవచ్చును. ఇందుకు యావదాంధ్రదేశము వారికి కృతజ్ఞతాంజలిని ఘటింపకతప్పదు. శ్రీ శాస్త్రిగారిని, ఆయన సాధనగ్రంథమండలిని పశుపతినాథరూపుడైన పరమేశ్వరుడు పదికాలాలపాటు పరిరక్షించుగాక.

మదరాసు<br>24—11—58

—వేమరాజు భానుమూర్తి



# ముఖద్వారము

భారతదేశమునందు ధర్మమునకు ప్రాముఖ్యత హెచ్చు. ఇచ్చటి భూభాగమంతయు పరమపవిత్రమైనది. అన్యదేశము లందును తీర్థస్థానములు గలవు. కాని భారతదేశమునం దడుగడుగున తీర్థస్థానములే. భారతదేశమునం దనేకులు మహనీయులు, తపస్సంపన్నులు జన్మించిరి. వారల తపోవిశేషము వలన నీ దేశము పవిత్రమైనది. హిందువులయందున్న తీర్థయాత్రాభిరుచి యన్యదేశములయందు గానరాదు. క్రైస్తవులకు, మహమ్మదీయులకు 'జెరూసలెమ్, వైటికెన్ సిటీ, మక్కా, మదీనా' మున్నగు తీర్థస్థానము లున్నవి. భారతదేశమునందు గూడ 'అజరశరీఫ్' మున్నగు మసీదులు మహమ్మదీయులకు యాత్రాభిగమ్యములైనవి కలవు.

భారతీయులకు యాత్రాసాహిత్యము తక్కువ. అందుల కుదాహరణము భారతీయుల యంతర్ముఖత్వము బాహ్యప్రపంచముతో సంబంధము లేకుండుట. ఒకవేళ నేకొలది యైన వర్ణింపబడినను నదియంతయు దేశీయమే కాని, యన్యదేశ్యము కాదు. ఒకవేళ వివిధదేశ సంస్థిత వస్తునిచయమందు వర్ణింపబడినను నదియంతయు నూహాగానమే కాని యథార్థము కాదు. అందువలననే యాత్రాసాహిత్యము తగినంతగా పెంపొందలేదు. అధికముగా సాధారణజనులు మాత్రము యాత్ర చేయుటచే, వారల యాత్రావిషయములు గ్రంథస్థము కాలేదు. పూర్వమునుండియు వ్యాపారస్థులు, విరక్తులగు సాధువులు, వృద్ధులు మాత్రమే యాత్ర చేయుట పరిపాటిగా నుండెను.

ఋషులు, మునులు నివసించిన దేశములు వారి తపః ప్రభావమువలన సార్థకమైన తీర్థాభిధానమున వెలుగొందు చున్నవి. భారతదేశమంతయు నొక పుణ్యక్షేత్రమే. ఉత్తర దేశమునం దీ తీర్థస్థానము లధికములు. ఈ తీర్థరాజములను సేవించుటకు భారతదేశపు మూలమూలలనుండి యాత్రికు లనుదినము వచ్చుచుందురు. భారతదేశమంతయు ప్రకృతి సౌందర్యమున కాకరమైయున్నను ఉత్తరదిశయందు కాశ్మీరు నందలి నంగాపర్వతమునుండి భూటాన్‌లోని చుమల్‌హాటీ వరకు గల భాగమంతయు సర్వోత్తమసౌందర్య సంశోభితమై యుండును. భారతీయ సంస్కృతి పెంపొందినది ఉత్తరదిశ యందే. అందుచేత నిచ్చట ప్రకృతిసౌందర్యమే కాక, చారిత్రక స్థానములు కూడ ననేకము గోచరించును. ఉత్తరదిశ యందే ప్రాచీనార్యులు నివసించిరి. యమునానది నుండి సరయూనదివరకు గల మైదానమంతయు పూర్వము ఆర్య సంస్కృతికి నిలయమై వెలసినది.

మన పూర్వులు బాగుగా నాలోచించి తీర్థయాత్రా విధాన మేర్పరచిరి. యాత్రలవలన వివిధదేశ విజ్ఞానము, అనారోగ్య నివారణ మున్నగు భౌతిక ఫలితములుకూడ లభించును. కేవలము వీనికొరకే యాత్ర చేయుడని యాదేశించినచో సాంసారికములగు నీతిబాధలవలన నధికసంఖ్యాకులు యాత్ర చేయజాలరనియు, తీర్థసేవనము సకలధర్మాచరణఫలితము నొసంగుననిన ధర్మభీరులగు భారతీయు లందఱు నెట్టెటో యాత్రగావించి, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక సత్ఫలితముల గాంచ

గలరనియు ప్రాచీనుల యూహ. ప్రతి ప్రాంతమునందలి యాచారములు, భాష, పంటలు మున్నగునవి పరస్పర భిన్న ములై యుండుటంజేసి యాత్రికునకు సర్వోత్తమజ్ఞాన మల వడును. సాంఘిక, చారిత్రక, ధార్మిక, భౌగోలిక సకల కలా విషయిక విజ్ఞానములతోపాటు వివిధ దేవీ దేవతా మందిర సందర్శనమున సకలకలుషముల దొలంగి యాత్రికు డాధ్యా త్మిక భావ విస్మృతి గాంచి మహానంద తన్మయత నొందును. స్థిరమైన సాత్వికభావ మాతని హృదయమందు నెలకొనును. జగన్మిథ్యాత్వము, క్షణభంగుర జీవనతత్వము యాత్రికుడు గ్రహించును. పారలౌకిక పిపాస యాతని కెక్కుడగును. భగవ త్సంసేవనాభిలాష, సత్కార్యాచరణాసక్తి, పుణ్యకార్యాచరణ తత్పరతయు నభివృద్ధిచెందును. ప్రాచీనుల యాధ్యాత్మిక, ఆధిభౌతిక కలావిషయక విజ్ఞాన శిఖరముల నాతడు చూచి ముట్ట నవలోకించి, తన్మహాత్మా భావవిస్మృత మనశ్శరీరుడై సత్కార్యాచరణ శీలుడగును. ఈశ్వరుని మహత్వ మాతని కన్నులకు గట్టినట్లగును. తోడ్తోడనే యాతనికి తన లఘుత్వ మును గోచరించును. విరాట్స్వరూపుడగు నీశ్వరుని యంశ తనయం దున్నదని గుర్తించగనే యాతనికి 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యార్థము స్ఫురించును.

దేశీయులెల్లరు దేశభక్తిపరిప్లావితమనస్కులై యుండ వలయునన్న ప్రథమమునందా దేశీయులు తమ దేశమునందలి వివిధప్రాంతములను సందర్శించి తన్మహాత్మాభావము నవగతము చేసికొనవలయును. ఇట్లు జరుగవలెనన్న "తీర్థాని సేవేత

సమాహితాత్మా" యను ప్రబోధము సర్వజనులకు శంఖా రావమువలె శ్రుతిగతమై, హృదయమున ప్రతిధ్వనించ వలెను. అప్పుడే నిజమైన దేశభక్తి. లేకున్న – దేశస్వరూపమే తెలియని ప్రాకృతిచీ విజ్ఞానమే లేనివాని యెడదలో దేశభక్తి యెట్లంకురించును? అందుచే నైతిహాసిక వివరణము లతో, రమణీయ ప్రకృతిసౌందర్యములతో, ధర్మప్రబోధ ముతో నొప్పు యాత్రావిజ్ఞాన మవసరము.

వివిధతీర్థముల సేవించిన మనుజు డుదారుడు, సర్వ కార్యాచరణదక్షుడు నగును. లోకులాతని బూజ్యుడుగ నెన్ను దురు. తీర్థసంసేవనమున బెంపొందునది ఆధ్యాత్మికవిజ్ఞానమే కాదు, మానవజీవితమున కుపకరించు యితర విజ్ఞానము కలుగును.

భారతీయుల తీర్థస్థానములన్నియు ప్రకృతినటీ క్రీడా రంగములే. ఈ సౌందర్యము యాత్రికుని నేత్రయుగ్మమున ప్రతిఫలించి, హృద్గతమై స్థిరనివాస మేర్పరచుకొనును. దానితో యాత్రికుడు సుందర హృదంతర సందీపిత శమ దమాది గుణనికరుడై వెలుగొందును.

భారతీయులకు తీర్థసంసేవన మవశ్యకర్తవ్యమని వివిధ పురాణములు ధర్మశాస్త్రములు నుద్ఘోషించుచున్నవి. ఆబాల వృద్ధము స్త్రీపురుషులెల్లరు విరక్తులైనను, గృహమేధులైనను ధనికులైనను, దరిద్రులైనను తీర్థసంసేవన మవశ్యకర్తవ్యము.

అన్యవిషయములను బోలి తీర్థసంసేవన విషయమున గూడ మన భావము లధోగాములగుట శోచనీయము, తలి

చుగ వృద్ధులు, అశిక్షితులు, అర్ధశిక్షితులు నగువారలు మాత్రమే యాత్రాభిముఖులై యుండుట గానవచ్చును. యువతీయువకులయందుగాని, బాలబాలికల విషయమునగాని యీ తీర్థసంసేవన భావము గోచరింపదు. కిశోరవయస్కులు తీర్థయాత్ర చేయుటయే తటస్థించినచో వారి సరళహృదయములందు పవిత్రభావము లంకురించి వారితోడనే యవియు వృద్ధిగాంచును తీర్థసంసేవనాభిలాషయు, ప్రకృతిసౌందర్య సందర్శనానందమును నా సరళ హృదయముల నుద్దీపింపజేసి యధిక విశాలభావముల కాకరములగునట్లు చేయును బాల్యావస్థయందలి వివిధసంఘటనలు తదనంతర జీవనమం దధికమనోహరములై, యానంద దాయకములై ప్రతిభాసించును. బాల్యమునందే తీర్థములను సేవించుచో తత్సందర్శన సంజనిత దివ్యభావములు సుస్థిరశాంతిదాయకములై యాతని జీవితమును, శీలమును సరిదిద్దుచు సన్మార్గప్రవృత్తిని గలుగ జేయును.

చిన్ననాట నే వస్తువు గాంచినను నద్భుతముగను, మనోహరముగను, అపూర్వముగను గోచరించును. అనంతర జీవనమునం దా వస్తువునే చూచుచో నట్టి యానందము లభింపదు. అట్టి యపూర్వత్వము, మనోహరత్వము కాన్పింపదు. సాత్త్వికభావములు సరళ బాలహృదయములందు నెలకొని యుండుటంజేసి యా సమయమున వివిధతీర్థపర్యటనము విశేష లాభదాయకము. బాలురందఱును భగవత్స్వరూపులేకదా!

విదేశములందు విద్యాభ్యాసము వివిధ ప్రాంత పర్యటనముతో కాని ముగియదు. దేశాటనము చేయకున్నచో వివిధప్రాంతములందలి ఆచారములు, సంస్కృతి, భౌగోళిక స్థితిగతులు నాతనికి బూర్ణముగా నవగతములుకావని వారల యూహ. ఇక మనమన్ననో వృద్ధులగుపర్యంతము సంసార లంపటులమైయుండి యనంతరము తీర్థసంసేవనమున కుద్యుక్తుల మగుదుము. పూర్వము యాత్రాసౌకర్యములు లేకుండుట, మార్గమునందు చోరబాధ, క్రూరజంతుభీతి మున్నగు వానివలన మనదేశీయులందు కేవలము వృద్ధాచారమైయుండ వచ్చును. నాడు 'కాశికేగుట కాటికేగుటయే' యని సాధారణ జనవిశ్వాసము. తిరిగి యిల్లుచేరుచో పునర్జన్మ నొందినట్లే. లేకున్న యాత్రాభినిష్క్రమణమే జీవనమునకు మహాప్రస్థానమనుట నిశ్చయము. అందుచే జీవనసంధ్యా సమయమున మాత్రమే యాత్రలు సేయుట మనవారియందు పరిపాటి యయ్యెను.

కాని నేడు యాత్రసేయుట కష్టముకాదు. చక్కని మార్గములు, ప్రయాణసాధనములు, ధర్మశాలలు మున్నగు సౌకర్యములు కలవు. అందుచే నేడు ఆబాలవృద్ధము స్త్రీ పురుషు లెల్లరు సుఖముగా తీర్థాటనము గావింపవచ్చును హిందువులకు ప్రాచీనాచారములు ప్రాణప్రియములగుట తీర్థాటన విషయమున గూడ నా ప్రాచీనుల మార్గమునే యవలంబించి కాలుసేతులు సత్తువ యుడుగుదనుక నిలువీడి పుణ్యక్షేత్రములను దర్శింప నుత్సహింపకున్నారు.

వైదేశికసభ్యత భౌతికములగు కొన్ని సుగుణములను మన కలవరచి, ఆధ్యాత్మిక విశ్వాసమును తుడిచిపెట్టినది. అందుచే ప్రాచీనులన్నను వారి యాచారములన్నను చాల మంది పరిహాసదృష్టి నవలోకించుట, విమర్శించుట నేడు కాన వచ్చుచున్నది. ఇట్టి విమర్శనలు, పరిహాసములుకూడ మన తీర్థసందర్శనాభిలాషను సన్నగిలచేయుచున్నవి.

మఱియు పూర్వము ధర్మస్థలములని పేరొంది, యాధ్యాత్మిక విభూతి కాలవాలములై యుండు తీర్థస్థానము లన్నియు నేడు అసత్యము, దురాచారము, అధర్మము మొదలగువాని కాటపట్టులై యున్నవి. ఈవిషయమును మఱుగుపఱచి ప్రయోజనములేదు. ఇట్టి దురాగతములు అప్పుడప్పుడు పత్రికాముఖమున వినవచ్చుచుండును. అందువలననే 'మోక్షమునకుం బోవ మొస లెత్తుకొనిపోయె' నను వాక్యము నిక్కమనుచు నధికసంఖ్యాకులు యాత్రావిముఖులై యున్నారు పండాలు 'మృతకళేబరమును గృధ్రములగుంపు' వలె యాత్రికుని జుట్టుముట్టి యాతనికి దిక్కుదోపనిస్థితిని కల్పింతురు. అందువలన తీర్థస్థలము లన్నచో పవిత్రభావములకు బదులు అసహ్యభావము రేకెత్తించుచున్నవి.

భగవంతుడు సర్వవ్యాపకు డయ్యు తీర్థక్షేత్రములం దాతడు సులభగమ్యుడై యున్నాడు. అగ్నితత్త్వ మన్నిటి యందు గలదుగాని, అగ్గిపెట్టెయందతి శీఘ్రముగ నది ప్రకట మగును. ఆ యగ్నితత్త్వమే కట్టెలయందు విజృంభించి ప్రకటమైనట్లు రాళ్లమీద విజృంభింపనేరదు. ఇట్టే తీర్థక్షేత్రములు

సర్వవ్యాపకమగు భగవత్తత్త్వమును సులభసాధ్య మొనర్చును, కాని మనుష్యుడు అగ్నివిజృంభణమందు పాషాణము వలెనుండక ప్రగాఢ భక్తివిశ్వాసప్రేరితుడై, ఏకాగ్రచిత్తుడై తీర్థములను సేవించినచో శుష్కములగు సమిధలయందు అగ్గిపెట్టెనుండి జనించిన యగ్నివలె శీఘ్రముగ భగవత్తత్త్వ మాతనియందు ప్రస్ఫురించి, నిరతిశయానందమునొందుటయే గాక సకలకలుషములుగూడ దొలగును.

ప్రపంచపటమును (మ్యాపు) జూచి భూగోళశాస్త్రజ్ఞుడు, భూమధ్యరేఖ, అక్షాంశరేఖలనుబట్టి యేయే ప్రాంత మెట్టి వాతావరణముకలిగి యెట్టిజనుల కావాసమైయున్నదో వెంటనే తెలుపగలడు. ఆ ప్రదేశ మరణ్యమో, మరుస్థలమో మహారాజనివాసమో, మహాక్రూరజంతు నిలయమో, సస్యశ్యామల భూభాగసమన్వితమోకూడ నాతడు నిర్ణయించును.

అట్లే ప్రాచీనులు భరతవర్షమునంతటి కొన్నిస్థానములు చంచల మానవచిత్తమును భగవదభిముఖ మొనర్చి, నశ్వరప్రాపంచిక విషయవాసనా విరహితములగావించి నిరతిశయానందానుభూతిచే హృదయము నుద్దీప్తముచేయ సమర్థములని తమ దివ్యజ్ఞానమున గనుగొని నిశ్చయించిరి. అవియే తీర్థములు. అందుచే నాధునికు లెవరైనను తీర్థయాత్రను నరసవిషయముగా బరిగణించిన నది వారల యల్పబుద్ధిని బ్రకటించును.

అధునికయుగమున వివిధదేశవార్తల నింటింట నెల్లరకెల్లవేళల నందించు రేడియో నెఱుంగనివా రుండరు. శబ్ద

పరమాణువులు వాయుతరంగతాడితములై యఖిలవిశ్వమునం దభివ్యాప్తము లగుచుండ వాని నీ యంత్రము గ్రహించును. శబ్దస్వరూపము కలిగించును శ్రవణకుహరముల జొనిపించును. ఈ సాధనమే లేకున్న నిఖిలవిశ్వవ్యాప్తములైనను ఆ శబ్దములను వినజాలము. హృదయమున తీవ్రమగు భక్తి, ప్రగాఢమగు భగవద్విశ్వాసము, సత్సాంగత్య, సత్సందర్శనాదుల యందు శ్రద్ధలేకున్న నే తీర్థమున కేగినను, నే నదియందు గ్రుంకులిడినను ఫలితము శూన్యమేయగును. అందుచేతనే—

> "భావం తతో హృత్కమలే నిధాయ,
> తీర్థాని సేవేత సమాహితాత్మా."

అని నారదపురాణము ఘోషింపుచున్నది

— గ్రంథకర్త.



# నేపాలయాత్ర

## పశుపతినాథము

### అవతారిక

అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా
హిమాలయోనామ నగాధిరాజః,
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః. — కాళిదాసు.

అని కవికుల తిలకుడగు కాళిదాస మహాకవి ప్రశంసల నందిన అపూర్వ మనోజ్ఞమైన హిమాలయపర్వత పాదతలమున గల స్వతంత్రరాజ్యము నేపాల్.

జటేశ్వరం సమారభ్య యోగేశాన్తం మహేశ్వరి!
నేపాలదేశో దేవేశి! సాధకానాం సుసిద్ధిదః.
— శక్తిసంగమ తంత్రము.

"హిమవత్పర్వతోపత్యకాధిత్యకలయందు జటేశ్వరము మొదలు యోగేశ్వరమువరకు పరివ్యాప్తమైన దేశమునకు నేపాలమని పేరు. ఈ ప్రదేశము సాధకులకు సిద్ధిప్రదమైనది." పూర్వమునుండియు భారతీయుల కిది యాత్రాస్థలమైయున్నది. నేపాలమునకు బోవు మార్గమునందంతట వివిధ పుణ్యక్షేత్రములు కాననగును. అందు జనకపురప్రాంతమునగల వివిధ దేవాయతనములు, కుండములు యాత్రికుల కవశ్య సందర్శనీయములు, సంసేవనీయములు.

ఈ దేశముయొక్క యునికి, మనికి, నిసర్గమనోహరత, దాని సంస్కృతి, దాని చారిత్రకప్రశస్తి, సహజరామణీయక మైన ప్రకృతిదృశ్యములు, తరతరముల పాటవముతో పెంపెక్కిన కళాకాదుల విజ్ఞానము, నానాజాతి ప్రజానీకము యాత్రికజనములను నిత్యాకర్షకములు.

ఇచ్చట గల పశుపతినాథము, ముక్తినాథము అతి ప్రాచీనకాలము నుండియు భారతీయులచే సందర్శింపబడి, సేవింపబడు పుణ్యక్షేత్రములు.

## యాత్రావశ్యకత

నిఖిలబ్రహ్మాండముల కధిపతియగు పరమేశ్వరుని సృష్టియం దనంత బ్రహ్మాండము లున్నవి. ప్రతియొక బ్రహ్మాండము నందు ననంతములగు భూభాగము లున్నవి. వానియందు భారతభూమి సర్వోత్కృష్టమైనది. ఇందలి సరిద్వనపర్వత జనపదాదులన్నియు పావనగుణగరిమా మహితములే. ప్రాణుల కుత్కృష్టమైన సిద్ధినొసంగుట యందివి కడుంగడుసమర్థములు. అందువలననే ఆర్థికసామాజిక పారమార్థిక నిబంధనలన్నియు భారతీయులకు శ్రుతిస్మృతిప్రతిపాదిత సిద్ధాంతములందు ప్రతిష్ఠింపబడి యున్నవి. ఆధర్మశాస్త్రములవలన భారతీయజీవన సంస్కృతీసభ్యతా విద్యావైభవాదుల సమ్యక్ జ్ఞానము లభించును. అందువలననే ప్రతి భారతీయుడు మాదేశము విశ్వశాంతి సందేశము నుపదేశించిన దేశమని స్వాభిమానముతో చెప్పుచుండును. మానవజీవన చరమోత్కర్ష ప్రాచీన భారతీయ సాహిత్యమునందుఁ గన్నులకు మిరుమిట్లు గొలుప

దేజరిల్లుచు గానవచ్చును. ప్రాచీనుల దృష్టియందు తీర్థ స్థలములే ఆ విశుద్ధ చైతన్యమును జాగృత మొనర్చుటయందు సమర్థములగు దివ్యదేశములు. వీనిని సేవించిన మానవులు ధైర్యసాహసములను, యశస్సౌఖ్యశాంత్యైశ్వర్యములను తమ పూర్వుల యపూర్వవరములుగా గ్రహించును.

నేడుగూడ నాతీర్థస్థలము లట్లే పరమపావనములై విలసిల్లుచున్నవి. ఈగౌరవభావమును మనసునం దిడుకొనియే నేటికిని లక్షలకొలది భారతీయులు దూరస్థిత, సమీపగత దివ్యతీర్థముల సేవింప నేగుచున్నారు. ("తరతి అనేన ఇతి తీర్థమ్") సంసారసాగరమును వీనివలన మానవుడు తరించును గాన వీనికి దీర్థములని ధర్మజ్ఞులగు ప్రాచీనులు పేరిడిరి. ఈ తీర్థము లలౌకికములు. స్వర్గపురికి సోపానములు. భవలీలా విలాసస్థానములగుట భగవన్మయములు. దర్శన, స్పర్శన, మజ్జనాభిగమన మాత్రమున తీర్థములు చిత్తశుద్ధిని కలిగించును. ప్రాచీన భారతీయ ఋషిపుంగవుల తపస్సే దీనికిం గారణము. ఆర్యఋషుల తీవ్రతమ తపశ్చర్యాసంబద్ధమైన తేజ మీపావనతీర్థ సంస్థిత రజః కణములందు సంనిష్టమై — బాలభానుని తరుణారుణ కిరణజాలము తమః పుంజముల దోలగ ద్రోయునట్లు — పాపుల పాపములను భస్మీపటలము చేయుచున్నది. తీర్థయాత్ర మానవసమాజమునకు మహత్పుణ్య ప్రదాయకము. తీర్థస్థలమున కేగగనే మానవుని చిత్తవృత్తులు సాత్వికములై దైవీసంపన్నిలయములై సంశోభించును. "ప్రతిమాంచ హరేదృష్ట్వా సర్వతీర్థఫలం లభేత్" ఇత్యాది సూక్తులవలన తీర్థములు భగవద్భక్తిని భావనయందు

స్థాయిగ నెలకొల్పుట కేర్పడినవని తెలియుచున్నది. సకల తీర్థమాహాత్మ్య ప్రస్తావనగా —

"తీర్థానాంచ పరం తీర్థం కృష్ణనామ మహాత్పరమ్,
తీర్థీ కుర్వంతి జగతం గృహీతం కృష్ణనామయోః."

"తీర్థములకెల్ల తీర్థమైనది శ్రీకృష్ణనామము శ్రీకృష్ణ నామసంకీర్తన గావించు సాధుపుంగవులు సకలప్రపంచమును తీర్థరాజ మొనర్చుచున్నారు" అని వాకొనబడినది. తీర్థ యాత్రకు సమ్యక్ఫలితము భగవదనుధావన కుపయుక్తమగు భక్తి, తీర్థసంసేవనాసక్తచిత్తుడగు యాత్రికుడు తీర్థక్షేత్రము లందు సంపాదించుకొనవలసినది – సమస్త చరాచరప్రపంచము శ్రీ మహావిష్ణురూపముగా గాంచగల్గుటయే. భారత దేశము అగణ్యానేక మహాతీర్థములకు నిలయము. తీర్థములు సకల పాప తాపాపనోదకము లని ధర్మశాస్త్రములు పదేపదే ఉద్ఘోషించుచున్నవి. చర్మ మాంస శల్యసంఘాతమగు నశ్వర శరీరమునకు గష్టనష్టములు వాటిల్లునని యాత్రావిముఖు డగు మానవుని జన్మ – వ్యర్థము.

గంగాది తీర్థేషు వసంతి మత్స్యాః,
దేవాలయే పక్షిగణాశ్చ సంతి॥
భావోజ్ఝితాస్తే న ఫలం లభంతే,
తీర్థాచ్చ దేవాయతనాచ్చ ముఖ్యాత్
భావం తతో హృత్కమలే నిధాయ,
తీర్థాని సేవేత సమాహితాత్మా. — నారదపురాణము

గంగాది పుణ్యనదులయందు మత్స్యములును, దేవాలయగోపురములందు పక్షిగణములు నివసించుచునే యున్నవి.

కాని యవి భావవిరహితము లగుటచే నాపుణ్యానదీ దేవాలయాదులవలన సత్ఫలితము నొందజాలకున్నవి.

అందుచే హృదయమున ప్రగాఢవిశ్వాస భక్తిభావములను నెలకొల్పి ఏకాగ్రచిత్తుడై తీర్థములను సేవింపవలెను. యజమానస్వరూపుడగు శ్రీ పశుపతినాధమహాదేవునికి ఆవాసభూమియగుటచే నేపాలము భారతీయుల కెల్లరకు యాత్రాభిగమ్యములందు ప్రధానమై యున్నది.

## యాత్రా నియమములు

శివరాత్రికి నేపాలయాత్ర చేయువారలకు మాత్రము నేపాలదేశమున ప్రవేశించుట కాజ్ఞాపత్ర మవసరములేదు. శివరాత్రికి 10 రోజుల ముందునుండి "రక్సౌలు" నుండి నేపాలమున ప్రవేశించుటకు యాత్రికుల కందరకు అనుమతి లభించును. శివరాత్రి మొదలు 7 రోజులవరకు నేపాలమునకు ముఖ్యనగరమగు కాట్మండూలోగాని, ఇతర నేపాలరాజ్యభాగమునగాని ఉండవచ్చును. ముక్తినాథయాత్ర చేయదలచినవారు కాట్మండూలో అర్జీపెట్టిన చైత్రమాసము వరకు నేపాలమున నుండుట కనుమతి లభించును.

శివరాత్రి సమయమున గాక నితర సమయములందు యాత్ర చేయదలచినవారు తమ జిల్లా కలెక్టరుగారిద్వారా తాము నేపాలదేశమునకు వచ్చుట కర్హులమని ప్రమాణపత్రము పొందవలయును. ఇన్కం టాక్సు ఆఫీసరువలనకూడ నేవిధమగు శుల్కము ప్రభుత్వమున కితడు చెల్లించవలసినది మిగులలేదని ప్రమాణపత్రము పుచ్చుకొనవలయును. ఈ

రెంటిని చూపినగాని నేపాలమున శివరాత్రికి భిన్నములగు సమయములందు ప్రవేశము లభింపదు.

## యాత్రా సమయము

నేపాలులోని పశుపతినాథమునకు యాత్రికులు అనుమతి పత్రమున్నచో ఎపుడు వెళ్లినను వెళ్ళవచ్చును. కాని డిశంబరు, జనవరి నెలలలో చలి మిక్కుటముగా నుండును. శివరాత్రికి భారతీయులు అధికముగా యాత్ర చేయుదురు.

ముక్తినాథయాత్ర చైత్ర శుద్ధముచుండి కార్తీకము వరకు చేయవచ్చును. దామోదరకుండము అను పుణ్యస్థలము ముక్తినాథమునకు పైన కలదు. అచటకుకూడ వెళ్ళదలచిన ఆగష్టు, సెప్టెంబరు నెలలలో యాత్రచేయుట మంచిది. జూన్, జులై నెలలలో వర్షములుకురియుట, మంచు కరగుట మొదలగు బాధలుండును. జూన్ నెలకు ముందు అచట మార్గము తెరువబడియుండదు. సెప్టెంబరు తరువాత హిమవర్షము కురియును. అందుచే నాతరువాత ముక్తినాథ దామోదరకుండములను సందర్శించుటకు వీలుండదు.

## ఆవశ్యక వస్తు నిచయము

పశుపతినాథయాత్రకు విశేషముగ సామాను అక్కర లేదు. శివరాత్రిసమయమున యాత్ర చేయువారికి వెచ్చని బట్టలు (ఉలెన్ రగ్గు, దుస్తులు), వంట స్వయముగా చేసికొనదలచిన వంటసామాను తీసికొనిపోవలయును. మార్గమువందన్నివస్తువులు సర్వత్ర దొఱకకున్నను, చాల చోట్ల దొరకును.

ముక్తినాథ, దామోదరకుండములకు యాత్ర చేయు దలచిన మంచి రెండు కంబళీలు, పంచదార, మిరియములు, కొంచెము చింతపండు, క్రొవ్వొత్తి, టార్చిలైటు, తేలికగా నుండు వంటసామాను తీసికొని వెళ్ళవలయును. ముక్తినాథము వరకు బియ్యము. పప్పు, పిండి మొదలగునవి దొరుకును ముక్తినాథమునుండి దామోదరకుండముకూడ వెళ్ల దలచిన 3, 4 రోజులకు సరిపడు ఆహారపదార్థములు ముక్తినాథము నుండి వెంట తీసికొనిపోవలయును.

## మార్గము

నేపాలుయాత్ర చేయుటకు భారత రైల్వేమార్గమున నేపాలు సరిహద్దువరకు వ్యాపించిన రైల్వే స్టేషన్లు కలవు. కాని హౌరామీదుగ వెళ్లుట దగ్గర. సులభము కూడ. హౌరానుండి అసన్‌సోలా (జం), కైలీ (జం), సమస్తీపూరు (జం) ల మీదుగా దర్భాంగ (జం) చేరవలయును. ఈ మార్గము ఆంధ్రదేశవాసులకు సుకరము. ఔత్తరాహులు లక్నో (జం), ఫైజాబాద్ (జం), గోరఖ్‌పూర్, రక్సౌల్ మీదుగా వెళ్ళుదురు.

బీహారు ప్రాంతమున పూర్వోత్తర రైలుమార్గమున 'రక్సౌలు' స్టేషను కలదు. దర్భాంగనుండిగాని, 'నరకోటియా గంజ్'నుండిగాని రక్సౌలుస్టేషనుకు చేరవచ్చును. రక్సౌలు స్టేషనుకు 1 మైలుదూరమున నేపాలుప్రభుత్వపు రైలుస్టేషను కలదు. అచ్చట యీ రైలు ఎక్కవలయును. ఈ రైలు కేవలము 29 మైళ్ళు ప్రయాణముచేసి "అమలేఖ్‌గంజి" స్టేషనులో నాగిపోవును.

అమలేఖ్ గంజి నుండి 'భీమఫేడీ' బజారు 27 మైళ్ళు లారీలమీద వెళ్ళవచ్చును. భీమఫేడీ నుండి 'థాన్కోట్' 8 మై. కాలి నడకను వెళ్ళవలయును. మార్గము యెగుడు దిగుడుగానుండి ప్రయాణము కఠినముగా నుండును. మార్గ మధ్యమున రెండు మకాము లున్నవి. దుకాణములుకూడ నుండును థాన్కోటకు కాట్మండూనగరము 6 మై. చక్కని రోడ్డు. లారీలు, టాక్సీలు కలవు. ఇదియే నేపాలదేశపు రాజ ధానీ నగరము. కాట్మండూకు సుమారు 2 మై. దూరమున పశుపతినాథమందిరము కలదు.

మార్గమున దర్భాంగా (జం) నుండియే అనేక పుణ్య క్షేత్రములను సందర్శించుచు సరిద్వన పర్వత నదీమాహాత్మ్య విశేషములను తెలిసికొనుచు, నానా దేవీ దేవతా నికరము నారాధింపుచు, చారిత్రికవిషయములను గుర్తింపుచు యాత్రికు లమందానంద సంభరిత హృదయులై యాత్ర చేయవచ్చును.

## యాజ్ఞవల్క్యాశ్రమము

దర్భాంగా (జం) నుండి సీతామఢీస్టేషనుకు పోవుమార్గ మున కమతౌల్ (14 మై.) స్టేషను కలదు. అచ్చటనుండి 3 మై. దూరము కాలినడకను ప్రయాణము చేసిన రమౌల్ గ్రామము చేరుదురు. ఇచ్చట నొక శివాలయము కలదు ఇందు యాత్రికులు బసచేయువచ్చును. ఈ గ్రామసమీపమున గౌతమకుండము గలదు. ఇచ్చటగల వటవృక్షసముదాయము యొక్క ప్రకృతిసౌందర్యము చూడదగినది. ఈ న్యగ్రోధ (మఱ్ఱి వనమునందే శ్రీ యాజ్ఞవల్క్యమహర్షి యాశ్రమము

కలదు. ఈ మహర్షి జనకునకు గురువు. శుక్లయజుశ్శాఖా ప్రవర్తకుడు.

గౌతమకుండము:—దర్భాంగా (జం) నుండి కమతౌల్ స్టేషను 14 మైళ్ళు. అక్కడకు 3 మై. దూరమున 'పులేరా' గ్రామము గలదు. ఇందొక అహల్యామందిరమున్నది. శ్రీరామ నవమి కిచట యుత్సవము జరుగును స్టేషనుకు 10 మైళ్ళ దూరమున గౌతమకుండమున్నది దీని యొద్దున నృసింహ మందిర మున్నది.

అహల్యాకుండము:— ఇది గౌతమకుండమునకు 3 మై. ఇచట అహల్యాదేవి వేదిక, శ్రీరామ లక్ష్మణ మందిరములు నున్నవి. గౌతముని శాపమున అహల్య యిచటనే శిలా రూపము నొందెనని చెప్పుదురు శ్రీరామపాద రజస్స్పర్శ వలన నామె దివ్యరూపమునొంది భర్తవద్దకు ఋషిలోకమున కేగెను. ఈ ప్రదేశమంతయు గౌతమాశ్రమముగా భావింప బడుచున్నది.

## జనకపురము

కమతౌల్ నుండి జనకపురీరోడ్ (పుపుడి) స్టేషను చేర వలయును. మరియు దర్భాంగనుండి సిక్రిం (జం) మీదుగ నేపాల్ రైల్వేకు సంబంధించిన జయనగర్ మీదుగాకూడ వెళ్ల వచ్చును. ఈ ప్రయాణము సుఖదాయకము.

జనకపురమునకు మిథిలా, తీరభుక్తి, విదేహము నను పేర్లు గలవు. పూర్వపు మిథిలానగరమున కీ జనకపురము దుర్గస్థానము. దీనికి నలువైపుల శివాలయములు గలవు.

అవి జనకపుర రక్షక దేవతామందిరములు. శిలానాథేశ్వర, కపిలేశ్వర, కూపేశ్వర, కల్యాణేశ్వర, జలేశ్వర, క్షీరేశ్వర, మిధిలేశ్వరములని వాని పేర్లు. ఇందు కపిలేశ్వర, కూపేశ్వర మందిరములు దక్క నన్యమందిరములు 5 క్రోసుల దూరమం దున్నవి. కోటకు నలువైపుల యాజ్ఞవల్క్య, విశ్వామిత్ర, వాల్మీకి, గౌతమ మహామునుల యాశ్రమము లున్నవి — చంపారణ్యమునుండి గండకీనదివరకు మిధిలగా చెప్పబడినది.

> గండకీతీరమాసాద్య చంపారణ్యాన్తకం శివే,
> విదేహభూ స్సమాఖ్యాతా తైరభుక్తాభిధా తు సా.
>
> — శక్తిసంగమ తంత్రము. 7 పటలము.

ప్రాచీన తైరభుక్తమే నేడు తిర్‌హూత్‌గా మారెను. మిధిలానగరము పూర్వమునుండియు వివేకశీలురగు మహనీయులకు నిలయమై యుండెను. వేదములందు, ఉపనిషత్తులందు కూడ దీని ప్రస్తావన కలదు ఇచ్చటి వేశ్యలుకూడ బ్రహ్మజ్ఞానసంపన్నులన్న నిక వేఱుగా నేమి చెప్పవలసి యుండును? మిధిలానగరవాసియగు వేశ్యయొక్క విచార మిట్లు వర్ణింపబడెను.

> విదేహానాం పురే హ్యస్మి న్నహమేకైవ మూఢధీః,
> యాన్యమిచ్ఛన్త్య సత్యస్మా దాత్మదాత్కామ మచ్యుతాత్.
>
> — శ్రీమద్భాగవతము.

"నిత్యసత్యస్వరూపుడును, పరమప్రేమస్వరూపుడును నగు పరాత్పరుని వీడి యన్యపురుషుని ప్రేమించు మూర్ఖురాలను నేనొక్కతెనే యీ విదేహనగరమున నివసించుచుంటిని."

జానకికి జన్మస్థలమగుటచేత గూడ నీ నగర మధిక మహత్త్వపూర్ణమయ్యెను ఇచ్చటి జనకకూపమున స్నానము చేసిన మనుజుడు విష్ణుసాయుజ్యము నొందును.

"జనకస్య తు రాజర్షేః కూప స్త్రిదశపూజితః,
తత్రాభిషేకం కృత్వాతు విష్ణులోక మవాప్నుయాత్.
— పద్మపురాణము - ఆదిమఖండము.

ఇచ్చట శ్రీ జానకీ రామచంద్రుల మందిరములు ప్రఖ్యాతములైనవి. జనకపుర మాహాత్మ్యము శతపథమున, తైత్తిరీయ బ్రాహ్మణమున, బృహదారణ్యకమున, కౌషీతకీ తంత్రమున విశేషముగ చెప్పబడెను.

మహాభారత యుద్ధానంతర మీ ప్రదేశ మంతయు పాడువడి నిర్జీవమైపోయెను. ఈ యేకాంతస్థలమును గాంచి సిద్ధులు, మహాత్ములు నిచట తపస్సుచేయసాగిరి. ఆ మును లలో చతుర్భుజగిరిసంన్యాసి, విష్ణుభక్త సూరకిశోర మహా త్ములు నొకరు. ఈయన స్వప్నమునందు భగవదాజ్ఞను పొంది అక్షయవటమూలమునుండి శ్రీరామపంచాయతనమును బయ టకు తీసెను. ఇందువలన జనకపురమునకు మిక్కిలి ఖ్యాతి కలిగెను. ఆ వటవృక్షము నేటికిని శ్రీరామ మందిరావరణ యందున్నది.

జానకీమందిరము:— పూర్వ మిచట శిథిలావస్థయం దున్న మందిర ముండెడిది. ఇచటనే మహాత్మా సూరకిశోరజీ సీతాదేవి స్వర్ణవిగ్రహమును, శ్రీరామవిగ్రహమును ప్రతిష్ఠిం చెను. టీకమ్‌గఢ్ మహారాణియగు వృషభానుకుమారి ఇచట నందమైన విశాలభవనము నొకదానిని కట్టించెను. అది జానకీ

భవనము, శీశ్ మహాల్ (అద్దాలమేడ) యను పేర ప్రసిద్ధి చెందెను.

ఈ భవన ప్రాకారములోననే శ్రీ జానకీ మందిరము నున్నది. ఇందు 'అంగరాగ సరోవరము' నుండి వెలికితీసిన సీతారామ లక్ష్మణ విగ్రహములున్నవి. రాజర్షి యగు జనకుడు, సునయున, శతానందుడు వీరల విగ్రహములుకూడ గలవు.

శ్రీరామ మందిరము:— సిద్ధులగు చతుర్భుజ మహా రాజ్ వారిచే అక్షయవట మూలమునుండి వెలికితీయబడిన శ్రీరామపంచాయతనము, శ్రీ లక్ష్మీనారాయణ విగ్రహములు, దశావతారమూర్తులు నిందు ప్రతిష్ఠింపబడెను. బృహద్విష్ణు పురాణమునం దీ ప్రదేశము సువర్ణమంటముగా పేర్కొన బడెను. దీని యావరణయందు చతుర్భుజనాథ మందిరము, మండపము, దేవీమందిరములు గలవు. జనకపురమునకు ఆది ప్రవర్తకుడైన చతుర్భుజమహాత్ములయొక్క జీవసమాధిపైన చతుర్భుజనాథుడు(శివుడు) ప్రతిష్ఠింపబడెను. దేవీమందిరము నందు రాజర్షి యగు జనకుని కులదేవతయగు త్రిపురసుందరీదేవి యొక్క మృత్తికాపీఠము చూడతగినది. ఇది శక్తిపీఠము లలో నొక్కటిగా పరిగణింపబడుచున్నది.

జనకమందిరము — ఇది శ్రీరామ మందిరమునకు నీశాన్యమునందున్నది ఇందు సునయనా జనకులయొక్కయు, గంగా సాగర సంగమమునుండి తీయబడిన శ్రీ సీతాదేవి యొక్కయు విగ్రహములున్నవి.

లక్ష్మణమందిరము:-ఇది జానకీమందిరమునకు సమీప మందున్నది. ఇందు సీతారామలక్ష్మణుల విగ్రహములున్నవి,

రంగభూమి:— శ్రీ జానకీమందిరమునకు వాయవ్య దిశయందు సుమారు 24 ఎకరము॥ సమతలభూభాగమున్నది. దీనికే రంగభూమి యని పేరు. దీనికి పశ్చిమదిక్కున మానీ బాబా మందిరమున్నది. దక్షిణమున 'సాధూగద్దీ' ఉన్నది. ధనుర్భంగ మిచ్చటనే జరిగెనందురు. వాస్తవమునకిది శ్రీజానకీ దేవికి నాటస్థలము. ధనుర్భంగము 'ధనుషా' అను స్థలమునందు జరిగెను. అచ్చట నేటికిని ధనుఃఖండములు గోచరించును.

రత్నసాగర మందిరము — శ్రీ జానకీ మందిరమునకు పశ్చిమోత్తరముగా నొక మైలుదూరమున రత్నసాగర సరోవర తీరమున నొక మందిరమున్నది. అందు శ్రీ సీతారాముల విగ్రహములున్నవి. దీనికి సమీపమునందే 'వైదేహీవాటిక' యను నొక నుద్యానము గలదు. జానకీ వివాహసమయమునం దిచ్చట రత్నములు పంచబడెనని కొందరు చెప్పుదురు. కొందరిచట నేడును రత్నములు దొరకునందురు ఇచ్చటకు పశ్చిమ దిశయందు అగ్నికుండమను నొక కుండము గలదు

దశరథ మందిరము:— మహారాజ సరోవరమునకు పశ్చిమమునందొక మందిరమున దశరథుని విగ్రహమున్నది.

జనకపురమున శ్రీరామ మందిరమున కెదురుగా ''ధనుస్సరము'' ''గంగాసాగర సరోవరము'' అను రెండు సరస్సులు గలవు. గంగాసాగరస్థానమునందే నిమి శరీరమును మథింపగా మొదటిజనకుడు పుట్టెనందురు.

రామమందిరమునకు తూర్పున ధనుస్సరోవరమున్నది. ఇచటనే శివుని ధనుస్సు ఉంచబడుచుండెడిది. ఇది యొక కాలువద్వారా గంగాసాగర సరోవరముతో కలుపబడెను.

అర్‌గజా సరోవరము:— ఇది జానకీభవనమునకు ఉత్తరదిక్కునందున్నది. సీతాదేవి యిందు సుగంధద్రవ్యము అను వైచి స్నానము చేయుచుండెడిదని చెప్పుదురు.

దశరథ సరస్సు — శ్రీ జానకీదేవి మందిరమునకు పశ్చిమదిక్కునందున్నది. దీనిని మహారాజసరస్సు అని కూడ పిలతురు.

జనకకుండము:— జనకపురమున కీశాన్యముగ 8 మై. దూరమున నిది కలదు. ఇందు స్నానముచేసిన విష్ణులోకప్రాప్తి కలుగును. అచటనే పరశురామకుండము కూడ నున్నది.

విహారమండపము:— ఇది రత్నసాగరమునకు బశ్చిమమునగల అగ్నికుండమునకు దక్షిణదిశయందున్నది. ఇచట సీతాదేవి స్నానము చేయుచుండెడిది.

విద్యాకూపము:— ఇది విహారకూపమునకు దగ్గరగా నున్నది. ఇచ్చటనే శతానందకూపముగూడ నున్నది.

దుగ్ధవతీనది:— ఇది జనకపురమునకు పశ్చిమదిశయందున్నది. శ్రీ సీతాదేవి జన్మించినపుడు కామధేనువు తన దుగ్ధములతో నిట నభిషేకింపగా, నా దుగ్ధధార ప్రవహించె నని చెప్పుదురు.

యమున — జనకపురమునకు తూర్పుదెసయందు 8మై. దూరమందున్నది. యమునానదియే యీ రూపమున ప్రవహించుచున్నటుల తోచును.

జలాధి:— ఇది యొక నది జనకపురమునకు తూర్పున ప్రవహించుచున్నది. దీనిని సరస్వతి నదియని చెప్పుదురు.

గేరుకానది:— జనకపురమునకు పశ్చిమోత్తర దిశయందు 3 మై.లో నీ నది గలదు.

ఇవికాక జనకపురమునం దింకను ఝూనీ, ఇక్షుమతీ మాధా (మండనా), వ్యాఘ్రమతీ, విరజా మున్నగు నదులు దగ్గరదగ్గరగా నున్నవి. జనకపురమున కాగ్నేయదిశయందు విశ్వామిత్రమందిర మున్నది

ధనుషా:— జనకపురమునకు 14 మై. దూరమున ధనుషా యను గ్రామము గలదు. ఇచటకు ఎద్దుబండిమీద వెళ్ళవచ్చును. ఇచట నడవిలో నొకసరోవరమున పెద్ద రాతి ధనుస్సు గలదు. ధనుర్యజ్ఞమున శ్రీరాముడు విరిచిన శివుని విల్లిదియే యని చెప్పుదురు.

ఉచ్చైర్:— జనకపురమునకు 32 మైళ్లు బస్సుమీద వెళ్ళవచ్చును. ఇచట దుర్గాదేవి మందిరమున్నది. కాళిదాసు ఇచ్చటనే దేవి నారాధించెనని చెప్పుదురు.

కపిలేశ్వర్:— ఇది ఉచ్చైర్‌కు తూర్పుగా 8 మై. దూరమందున్నది. దర్భాంగ స్టేషనునుండి కూడ బస్సుమీద నిచటకు చేరవచ్చును. ఇచట ధర్మశాల, కుండము, కపిలేశ్వర మందిరములు కలవు. ఇచటకు 1 మైలు దూరమున వనదుర్గా మందిరము గలదు. అంతవరకు చక్కని రోడ్డు గలదు

కుశేశ్వర్:— వనదుర్గా మందిరమునకు తూర్పుగా 32 మై. దూరమందున్నది. దర్భాంగనుండి పిపరాఘాట్ వరకు బస్సుమీద ప్రయాణముచేసి, అటనుండి 4 మై. నడిచి వెళ్ళవచ్చును. ఇచటి కుశేశ్వరమహాదేవుడు కామితార్థ

దాయకుడని ప్రతీతి. ఈ ప్రదేశమందు కుశేశ్వరుని యారాధించి కోర్కెలు బడయువార లసంఖ్యాకులు.

## సీతామఢీ

జనకపురినుండి రక్సౌల్‌కు పోవుమార్గమున సీతామఢీ స్టేషను కలదు. ఇది ముజఫర్‌జిల్లాకు చెందినది. ఇచ్చట యాత్రికులకు ధర్మశాల కలదు. ఇచ్చటగల నదిపేరు "లఖ్‌దేఈ". ఈ నదికి పశ్చిమతీరమున సీతామఢీ ఉన్నది. ఇచట నొక ఆవరణయందు శ్రీ సీతామందిరము కలదు. ఇచ్చట నింకను చాల సుందిరములు కలవు ఇందు శ్రీరామ, లక్ష్మణ, ఆంజనేయ, గణేశ మందిరములు ప్రధానములు. శ్రీరామ నవమి కిచ్చట నుత్సవము జరుగును.

## సీత పుట్టుక

సీతామఢీకి 1 మైలుదూరమున 'పుణ్‌వాడా' గ్రామము కలదు ఈ గ్రామమునందొక సరస్సు కలదు. ఇందుండియే సీత పుట్టెనందురు.

నిమివంశీయుడగు హ్రస్వరోమమహారాజునకు సీరధ్వజుడను పుత్రుడు జన్మించెను. దేశము క్షామపీడితము కాగా సీరధ్వజుడు యజ్ఞార్థము పసిడినాగలితో భూమిని దున్నసాగెను. ఆ సమయమున నాగటిచాలునుండి యొక కన్య ఉద్భవించెను. అందువలననే ఆమెకు సీత (నాగేటిచాలునుండి పుట్టినది) సార్థకనామ మయ్యెను. ప్రస్తుత మిచ్చట 'ఉర్విజా కుండము' అను ప్రాచీన పావనకుండము కలదు.

సీతామఢీనుండి రక్సౌలుస్టేషను, అటనుండి వెనుక జెప్పబడిన మార్గము ననుసరించి అమలేఖగంజి, భీమఫేడీల మీదుగ థాన్కోట్, అచటినుండి కాట్మండూ (నేపాలదేశపు రాజధానీనగరము) చేరవలయును.

## దేవకులీ భువనేశ్వరము

సీతామఢీస్టేషనుకు 16 మై. దూరమునం దీ స్థానము కలదు. ఇచ్చట దేవకులసరోవర మున్నది. ఈ సరస్సునకు తూర్పుగా భువనేశ్వరమందిరము గలదు. ఇందు ప్రాచీనకాల భైరవీ విగ్రహ మొకటి గలదు. ఇచ్చట నింకను చాల ప్రాచీనశిధిలములు కలవు. అభిమన్యుని వివాహమునకు విరాట నగరమునకు బోవు పాండవు లిచ్చటనే విడిసిరని చెప్పుదురు. ఇచట నూతనముగా నిర్మింపబడిన మందిరములు చాల కలవు.

## నేపాల్

ఇది స్వతంత్రరాజ్యము. ఇండియా ఈశాన్య సరి హద్దులో 80°15 - 88°10′ తూర్పురేఖాంశముల మధ్య 26°20′ - 30°10 ఉత్తరఅక్షాంశముల మధ్య 8,431,537 మంది ప్రజలతో 54000 చదరపుమైళ్ళపర్యంతము వ్యాపించి యున్న హిమాలయపర్వత పాదతలంలో ఉన్న చిన్న దేశము యిది. సముద్రమట్టమునకు 3000 లగాయతు 6000 అడుగుల ఎత్తువరకూ ఉన్న పీఠభూమి. దీనికి ఉత్తరమున టిబెట్టు, దక్షిణమున పడమరన హిందూదేశము, తూర్పున శిక్కిం దేశములు ఎల్లలుగా గలవు. దాని సరిహద్దులలో హిమా లయ పర్వతశ్రేణులలో ఎత్తైన ఎవరెస్టు పర్వతము (29141

అడుగులు), మకాలూ (27790 అడుగులు), కాంచనగంగ (28140 అ.), ధవళగిరి (26800 అ.), గౌరీశంకర్ (23440 అడుగులు), మున్నగు ఉన్నతశిఖరములు ఎన్నియో ఉన్నవి. మొత్తముమీద వాతావరణమంతయు చాల ఎత్తుగవున్న ఉత్తరప్రాంతములలో తప్ప మిగిలినదేశమంతటా చలి తక్కువగా నుండును. ఉత్తరమునమాత్రము ఎముకలుకొరికే చలి.

## చరిత్ర

నేపాలదేశపు చరిత్ర బహుపురాతనమైనది. క్రీ.పూ. ఏడవశతాబ్దమునాటికే ఇండో-ఆర్యన్ జాతికి చెందిన ప్రజలు ఇచ్చట స్థిరనివాసమేర్పరచుకొని తమ వేదసంస్కృతిని సుస్థిరముగ పాదుకొల్పినట్టు చెప్పుటకు చాల నిదర్శనములు గలవు.

ఈదేశములోని దేవాలయములు, స్తుతిగీతములన్నియు ఆర్యప్రోక్తము లైనప్పటికిని నేపాల్‌లో దేవతలకు బ్రాహ్మణులకు అవినాభావసంబంధము లేదు. హక్కులు గౌరవాదరణములు అన్నియు బ్రాహ్మణులవలననే దేవతలకు లభింపవలయునను నియమ మీ దేశమున లేదు. కాగా నీదేశమున సర్వమానవ సౌభ్రాతృత్వము మొదటినుండియు నెలకొనియున్నది.

క్రీస్తుకుపూర్వము 6వ శతాబ్ది మధ్యలో హిందువులు దండెత్తి సుమారు సగపాలు తమ కైవశము చేసికొన్నప్పుడు నేపాలురాజ్యమే వారిని ఎదిరించి నిలువబడెను. మరొకవిశేషమేమనగా నేపాలుదేశములోనే గౌతమబుద్ధుడు సకలమానవకోటికి నిర్వాణపథమును జూపు మహోన్నత మతసిద్ధాంతమును సూచించియున్నాడు.

ఆతరువాత నేపాలును కబళించవలెనని పేరాశతో ముందడుగువేసిన మహాద్యులు, గుప్తులు, టిబెట్టువాసులు, కాశ్మీరీయులు మున్నగువారిని ఎదిరించి నేపాలు తన స్వాతంత్ర్యమును కాపాడుకొనెను. ఈ స్వాతంత్ర్య సమరమున నేపాలుదేశ స్వాతంత్ర్యమును నిలువబెట్టినవారిలో కిరాటీలు, లిచ్ఛవులు, వైశ్యులు ప్రధానులు.

మహామ్మదీయులు తమ యపూర్వ పరాక్రమముతో యావద్భారతదేశమును జయించి, తమ మతవ్యాప్తికి అనేక ప్రయత్నములు సాగించిన సమయములో నీ దేశమున మల్ల మహారాజులు స్థానిక సంప్రదాయములకు, సంస్కృతికి దేశ కాలానుగుణ్యమైన సంస్కరణలను జోడించి స్వాతంత్ర్య సంరక్షణ చేసిరి.

## రాజవంశ చరిత్ర

నేపాలుదేశముకూడ క్రీ. శ. 1742 వరకు భిన్నభిన్న సంస్థానముల యాధిపత్యమునకు లోనై అంతఃకలహములతో నిండియుండెడిది. క్రీ.శ. 1742 లో శ్రీ పృథ్వీనారాయణషా వారు శ్రీ కుమారీదేవి అనుగ్రహమును బడసి యీ విభిన్న సంస్థానముల నన్నిటిని ఒక ఛత్రచ్ఛాయకు దెచ్చి ఏకచ్ఛత్రాధిపత్యమును నెలకొల్పిరి.

వీరు చిత్తూరు రాజవంశమునకు చెందినవారు. క్రీ. శ. 1303 లో శ్రీ ద్రవ్యషా అను వీరి మూలపురుషు డీ దేశమునకు వలసవచ్చి యిచ్చట సంస్థానాధిపతులైరని చెప్పుదురు. శ్రీ పృథ్వీనారాయణషావారి కాలమున నేపాలు దేశమున

సాహిత్యము మిక్కిలి వృద్ధిచెందినది. వీరి ప్రోద్బలమున శక్తిబల్లవ్, ఉదయానంగ్ మున్నగు కవీశ్వరులు రాణించిరి.

శ్రీ పృథ్వీనారాయణషావారు మరణించునప్పటికి ఆయన సంతానమునం దెవరును ప్రాజ్ఞులు కానందున, ఆ పసివారిని వెనుకకునెట్టి పాండేలు, తాపాలు అనువారు రాజ్యాధికారమును చేజిక్కించుకొనుటకు అంతర్యుద్ధమును సాగించిరి. వీరిలో అవక్రపరాక్రమమును ప్రదర్శించిన యోధాగ్రేసరులు దామోదరపాండే, అమరసింగ్ తాపా అనువారు. 19 వ శతాబ్ది ప్రారంభమున శ్రీ భీమసేనతాపా అమోఘమైన కుశలతను, నిర్మాణదక్షతను ప్రదర్శించి వాసికెక్కెను.

నేపాలమున నూరుసంవత్సరములుగా నెలకొనియున్న నిరంకుశత్వము క్రమముగా నేడు ప్రజాస్వామ్యములోనికి మారుట ఇటీవలి చరిత్రలో ముఖ్యముగా గమనించతగిన విషయము. చాలకాలమునుండి ప్రధానమంత్రిత్వము రాణా జంగ్ బహాదుర్ కుటుంబమునకు వంశపరంపరాధీనమైయున్నది. దానిని శ్రీ త్రిభువనరాజు అనువారు 18 ఫిబ్రవరి, 1950 లో రద్దుచేసి, కాంగ్రెసు ఒడంబడికను ఆమోదించిరి. దాని ఫలితముగా ప్రజాప్రతినిధులతో కూడిన మంత్రివర్గము ఏర్పాటైనది. 17 జనవరి, 1957 సం॥రములో నిర్ణయింపబడిన ప్రకారము శ్రీ మహేంద్రరాజావారి రాజత్వమున ప్రజాపరిషత్తు నాయకుడు శ్రీ తంకాప్రసాద్ ఆచార్య మంత్రిత్వమున నవనేపాల రాజ్యాంగరచనకు ప్రజాప్రతినిధులతో కూడిన ఒక రాజ్యాంగ పరిషత్తుకూడ నిర్మింపబడినది. నేపాలము మంచుకొండల

మధ్యలో నొదిగియున్నను రాజ్యాంగరచనలో నీతినాగరిక మైన ప్రజాప్రభుత్వవిధానము నే స్వీకరించినది

1951 సం॥ సుప్రీంకోర్టు శాసనము ననుసరించి, ఒక ప్రధాన న్యాయాధిపతి, నలుగురు ఉపన్యాయాధిపతులతో ఉన్నతన్యాయస్థానముకూడ నిట నెలకొల్పబడినది. ఈ దేశ మునకు శిక్షాస్మృతిని సయిదాను ప్రభుత్వము నియమించిన న్యాయనిపుణుల సంఘమువారు ఇటీవలనే తయారుచేసిరి. ఇది చాలవరకు ఇండియన్ పీనల్‌కోడ్‌కు అనుకరణయే.

నేపాలీయులగు గోర్ఖాలు యుద్ధవీరుల జాతివారు. 45,000 బలగముకల నేపాలుసైన్యదళము ప్రపంచ యుద్ధరంగములలో చాల పేరుప్రఖ్యాతులను సంపాదించెను. హిందూ దేశమునకు, ఇంగ్లీషుదేశమునకు సంబంధించిన సైన్యములలో కూడ, ఈదేశమునకు సంబంధించిన గోరిల్లాదళము ప్రముఖ పాత్రను ధరించుచున్నది. ఇట్లు సుసంఘటితమైన సేనానివ హము కూడ నీదేశమున నెలకొనియున్నది.

## నాణెములు

పూర్వమునందే నేపాలురూపాయి నూరుపైసల క్రింద విభజన చేయబడినది. దీనివిలువ మనదేశపు రూపాయికన్న తక్కువ మనదేశపు 100 రూపాయిల విలువ, ఆదేశపు 115 రూపాయిలకు సమానము. మనదేశములోవలెనె 100, 10, 5, 2 రూపాయిలనోట్లు, ఒకరూపాయినోటులు యీదేశమున కలవు. ఈదేశములో మొదటిసారిగా కాగితపునోట్లు 1945 లో చలామణీలోనికి వచ్చినవి. నేపాలులో స్టేటుబ్యాంకు,

26 ఏప్రియల్ 1956 లో ప్రారంభమయినది. నాణెములు, నోట్లు తయారుచేయుట, విదేశీయ ద్రవ్యమారకములను నిర్ణయించుట, ప్రభుత్వపు ఆదాయ వ్యయములను నిర్ణయించుటలో సహాయముచేయుట మొదలగునవి ఈబ్యాంకు చేయు పనులలో ముఖ్యమైనవి.

## విద్యాసంస్థలు

1955 సం. జనాభా లెఖ్ఖలప్రకారము ఈ దేశములో 1028 ఇంగ్లీషుపాఠశాలలు, 248 సంస్కృతపాఠశాలలు, 49 బేసిక్ విద్యాలయములు, 7 బేసిక్ కళాశాలలు, 7 ఇంటర్మీడియట్ కళాశాలలు, మరి 7 వేరువేరు విద్యాసంస్థలు కలవు. దేశముజనాభాలో నూటికి ఆరుగురుమాత్రమె విద్యావంతులు,

## రేడియో ప్రసారము

ఈ దేశమున రేడియో ప్రసారసౌకర్యములు త్వరితగతిని విస్తరించుచున్నవి. ఈ దేశపు సంస్కృతీ సాహిత్యములను ప్రపంచప్రజలకు పరిచయముచేయుటయే దీని ముఖ్యోద్దేశ్యము.

## అన్యదేశ సంబంధము

హిందూదేశమునకు నేపాలమునకు గల సంబంధబాంధవ్యములు నేటివికావు. దేశసంస్కృతి, మతము, జాతి, భాష మొదలైన వానియందు ఈ రెండు దేశములకు అవినాభావ సంబంధమున్నది. ఈ దేశములోని గుహ్యేశ్వరీ, పశుపతినాథము మొదలైన పుణ్యక్షేత్రములకు హిందూదేశములోని మారుమూలలనుండియు యాత్రికులు వచ్చుచుందురు.

ముఖ్యముగా నేడు నేపాల భారతదేశముల మధ్య స్నేహము ఇతోధికముగా వృద్ధిపొందుచున్నది ఆర్థికముగా కూడ ఈ దేశమునకు సహాయముచేయుటకు భారతదేశము పూనుకున్నది. నేపాలదేశము ప్రారంభించిన 33 కోట్ల రూపాయల పంచవర్ష ప్రణాళికకు 10 కోట్ల రూపాయలవరకూ ధన సహాయము చేయుటకు హిందూదేశము అంగీకరించినది. 4 కోట్ల 20 లక్షల రూపాయలు ఇచ్చివేసినది కూడ. ఇంకను చాల సహాయము ఆర్థికముగా, సాంకేతికముగా చేయబోవు చున్నది. ఇట్లు నేపాలము, భారతదేశము పరస్పర సహకార సౌహార్ద్రములతో వర్తించుచున్నవి.

## ఎగుమతులు – దిగుమతులు

ఈదేశమున ఆహారపదార్థములు, జనపనార, కలప, నూనెగింజలు, నెయ్యి, బంగాళాదుంపలు, మూలికలు, తోళ్లు మొదలైనవి అధికముగా నుత్పత్తియగును. వీనిని వీరు ఇతరదేశములకు ఎగుమతిచేయుదురు. ఉప్పు, పెట్రోలు, కిరసనాయిలు, పంచదార, యంత్రములు, మందులు, పాద రక్షలు, కాగితము, సిమెంటు, ఉక్కు, ఇనుము, తేయాకు మొదలైనవి యీదేశమునం దుత్పత్తికావు. అందుచే నీవస్తు వులను అన్యదేశములనుండి వీరు దిగుమతి చేసుకొందురు. వ్యాపారము ముఖ్యముగా టిబెట్, హిందూదేశములతో మాత్రమే సాగుచున్నది.

ఈ దేశమున చాల ముదుకరకపు బట్టలు మాత్రము తయారుచేయబడుచుండెను. ఈదేశపు మధ్యతరగతి, అంతిమ

తరగతులకు చెందిన ప్రజలుమాత్రమె ఈ బట్టల నుపయో గింతురు. రాగి, ఇత్తడి, ఇనుములతో వస్తువులను చేయుట, కంచుపోత, కుండలుచేయుట మొదలైనవి యీ దేశమునగల యితర పరిశ్రమలు.

## ఆర్థిక వ్యవస్థ

ఈ దేశపు దక్షిణభాగమున ప్రశస్తమైన అటవీసంపద చాల కలదు ప్రతిసంవత్సరము యీ యడవులనుండి అనేక కోట్లరూపాయిాల విలువగల వివిధరకముల కలప లభించును. ఉత్తర సరిహద్దులలోని హిమాలయపర్వత సానువులలో లభించు వైద్యమూలికలు ప్రపంచమునందంతట విక్రయించ బడును. వరి, మొక్కజొన్న, జొన్న, గోధుమ, అపరాలు, చెఱకు, పొగాకు మొదలైనవి యీ దేశపు ముఖ్యపంటలు. మొత్తము విస్తీర్ణములో మూడవవంతు (11 . 2 మిలియన్ల ఎకరములు) అడవులమయము. 5 . 4 మిలియన్ల ఎకరములు పూర్తిగా మంచుమయము. 6 . 6 మిలియన్ల ఎకరములు మాత్రమె సాగుచేయబడుచున్నది. ఇట్లు యీ దేశము తగు మాత్రపు టాదాయము గలిగియున్నది.

## ప్రజలస్థితి – భాష

ఇచ్చటి ప్రజలలో మంగోలియన్ లక్షణములు చాల కనబడును. కాని భారతీయుల పోలికలు చారికలు కూడ ఎక్కువ. వీరిలో భోటియాలు, మార్మ్లు, గూర్ఖాలు, నేవార్లూ, కిరాంటీలు, లింబూలూ, లెప్చాలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, రాజపుత్రులు, కుర్మీయులు, కోయిరీలు, భిల్లులు,

ధీవరులు, రాజవంశీయులు — అని అనేక తెగలవారలు కలరు. వీరిలో చాలమంది హిందువులు, కొందరు బౌద్ధులు. రాజవంశీయులు మైథిలి, భోజపురి, మాగధి, అవధి భాషలు మాట్లాడుదురు. నాగరలిపిలో వ్రాసిన పార్వతీయభాష వీరివ్యాపార భాష, నేపాలీభాష రాజభాష యందరకు తెలియును.

ఇచట బౌద్ధమతము, హిందూమతము చాలవరకు వ్యాప్తిలోనున్నవి. ప్రజలకు పరమతసహనము చాలహెచ్చు. దేశము మొత్తమువిూద చదువుకున్నవారు 100 కి ఆరుగురు మాత్రము ప్రయాణయోగ్యములైన రోడ్లు చాల తక్కువ. కంచరగాడిదమీద, చాలదూరం ప్రయాణము చేయవలసి యుండును. ఎద్దుబళ్లు, దున్నలబండ్లు, ఏనుగులు, పోనీలు, గాడిదలు, గొర్రెపొట్టేళ్ళు, మేకలు, జడలబర్రెలు మొదలగువానిమీద వేసి సామాను ఒకచోటనుండి యింకొకచోటికి తరలింతురు. వాహనములు లేకపోయినను, వాహకులు మాత్రము ప్రతిచోట పుష్కలముగా తిరుగుచుందురు. ఇక్కడినదులలో ముఖ్యమైనవి సప్తకోసి, కృష్ణకాళి, గండకి, కార్నాలి, బూరిగంగా, దాప్తి, వాఙ్మతి మున్నగునవి.

సాగర్మాతా, కాంచనగంగా, మకాలు, ధవళగిరి, మనాస్లులు. గొసైక్థాక, అన్నపూర్ణ, హిమాల్బులి, గౌరీశంకర్ మొదలగు హిమాలయపర్వత శిఖరములు నేపాలులో అవశ్యము సందర్శనీయములు. అచ్చాంలో మేకలవంటి గంగిగోవులు, కృష్ణగండకీలో సాలగ్రామములు లభించును.

## కాట్మాండూ

నేపాలుదేశములో అవశ్యసందర్శనీయములైన ప్రాంతములు, పట్టణములు, సహజ రమణీయములైన పల్లెలు, యాత్రాకేంద్రములు, క్షేత్రములు, దేవాలయములు, తుషారావృతమైన హిమగిరిశృంగములు పెక్కు గలవు

నేపాలమున ప్రధాననగరములు నాలుగు. కాట్మాండూ (మంజుపాటనము), కీర్తిపురము, పాటన్, భద్గాం ఇవి పెద్ద నగరములు. ఇవియున్నియు నొకప్పు డీ దేశమునకు రాజధానీ నగరములై వాసిగాంచెను.

కాట్మాండూనగరము ఈదేశపు ప్రస్తుతరాజధాని. ఇది ఇండియా సరిహద్దుకు 75 మై. దూరమున సముద్రమట్టమునకు 4500 అడుగుల ఎత్తున, వాఙ్మతి ( భాగామతి ), విష్ణుమతీనదుల పవిత్రసంగమస్థలమున ధవళమనోహరమైన హిమగిరి శృంగ ప్రాకార పరివేష్టితమైన, మనోజ్ఞప్రకృతికి ఆలవాలమై సువిశాలమైన లోయలో నిర్మింపబడినది. దీని జనాభా 1,08,805. పాటన్, భద్గాం ఈ రెండు దేశములోని పెద్ద నగరములు. వీనిలో మొదటిదానిజనాభా 1,04,928. రెండవదాని జనాభా 93,176. ఇటగల గిరిశిఖరములు 6,500 అ. మొదలు 9,000 అ. ఎత్తువరకు ఉన్నవి ఈ పట్టణము ప్రాతక్రొత్తల మేలికలయికకు చక్కని నిదర్శనము. ఇక్కడ చరిత్రప్రసిద్ధమైన ప్రాచీనక్షేత్రములు, బౌద్ధారామ శిల్పసంపదతో కూడిన పవిత్రదేవళములు, ఆధునిక శిల్పమునకు కాణాచియైన పెక్కుకట్టడములు కలవు. ఇందు ముఖ్యమైనవి పశుపతినాథ

దేవాలయము, స్వయంభూస్తూపము, గుహ్యేశ్వరీ దేవాలయము, బౌద్ధస్తూపము, తలేజుమందిరము, కాట్మండూ నగరమునకు దక్షిణమున దక్షిణకాళి, ఉత్తరమున బుద్ధనిలకంఠము మొదలైనవి కలవు. ఈ పట్టణము కళలకు నెలవు. చేతివృత్తులకు గొప్ప కేంద్రము. ప్రాచీన, అధునాతన విద్యలకు పీఠస్థలము.

దేశమునకు నలుమూలలకు రహదారులు విస్తరించియున్నవి. కలకత్తాకు విమానమార్గము కలదు. ఇక్కడ బిర్ లైబ్రరీలో పాళి, ప్రాకృత, సంస్కృత, చేనీస్, టిబెట్టు, నేవారీ, మైథిలీ భాషలకు చెందిన 24000 గ్రంథములున్నవి. ఇవికాక జనరల్ కేసర్ సొంతలైబ్రరీ, శాంతినికేతన లైబ్రరీ, త్రిచంద్రకళాశాల లైబ్రరి తప్పక సందర్శింపదగినవి. ఇక్కడ వనౌషధ పరిశోధనకళాశాల అవశ్యము చూడదగినది.

లలితాపూర్:— కాట్మండు తరువాత చెప్పదగిన పట్టణము లలితాపురము దీనినే పాటన అందురు. ఇది కాట్మండూకు ఆగ్నేయముగా 3 మై. దూరమున గలదు. ఇది చరిత్రప్రసిద్ధమైన చోటు. ప్రాచీనప్రాసాదములకు, పవిత్ర దేవాలయములకు నెలవు. మహాబౌద్ధ దేవాలయమునకు, కృష్ణ మందిరమునకు దేశదేశమునుండి యాత్రికులు వచ్చుచుందురు. వీధులు సన్నగా నున్నను పరిశుభ్రముగా నుండును. దారుశిల్పము, విగ్రహనిర్మాణము, లోహపుపోతపని ఇక్కడి ప్రజల ప్రధానవృత్తులు.

భక్తిపూర్ — ఇది చూడతగినది. దీనినే బడ్ గాం అనికూడ నందురు. ఇది కాట్మండూకు తూర్పుగా 6 మైళ్ళ

దూరమున గలదు. ఇదియు ప్రాచీననగరము. ఇచటి ప్రజలు శిల్పము, లోహము, దారు వృత్తులలోను ప్రవీణులు. ఇచట ప్రధానముగా చూడదగినవి – పూల దేవాలయము, భైరవ దేవాలయము, దత్తాత్రేయదేవాలయము, ప్రాతవజ్ర యోగినీ దేవాలయము, స్వర్ణ ప్రాంగణప్రాసాదము.

బీర్‌గంజ్ పట్టణము:— ఈపట్టణము మొన్న మొన్నటిదే అయినను శరవేగముతో నభివృద్ధి పొందుచున్నది. ఖాట్మండూకు దక్షిణముగా 84 మై. దూరమున పర్వతపు లోయలో నున్నది. ఇది నేపాల్‌కు సింహద్వారము వంటిది. భారతదేశమునందలి రక్సౌలుకు ఉత్తరముగా 3 మై.దూరమున గలదు. ఇచట ముఖ్యమైన రైలుస్టేషనుకూడ కలదు. ఈపట్టణమునకు అతిసమీపములోనున్న చారిత్రక ప్రాంతము "సిమ్రాంఘర్" క్రీ. శ. 13–14 శతాబ్దములలో నాన్యదేవుని పాలనలో పేరుమోసిన గొప్పరాజ్యము పురాతత్వశాఖవారు శ్రద్ధవహించిన నీ ప్రాంతమున ప్రాచీనవస్తువు లనేకము లభింపవచ్చును.

లుంబినీనగరము:— నేపాలులో ప్రపంచప్రఖ్యాతి గాంచిన ప్రాంతము లుంబినీనగరము ఇది గౌతమబుద్ధుని జన్మస్థానము. భారతదేశములో ఈశాన్యరైల్వేలో 'నౌగర్' స్టేషనునుండి 21 మైళ్లు. ఇక్కడికి మంచిరోడ్డుకలదు. ఇక్కడ పగిలిన అశోకస్తంభము, శిధిలబౌద్ధారామము, బుద్ధదేవుని మాతృశ్రీ మాయాదేవి రమణీయప్రతిమ సందర్శింపదగినవి. ఆ పరిసరములలో నున్న ఉద్యానవనముల ప్రకృతిశోభ యాత్రికుని నేత్రముల కమందానందమును కలిగించును.



కాట్మాండు నగర దృశ్యము



T C. కాలేజి – కాట్మాండు

పోఖరాలోయ:— పోఖరాలోయ చాల యందమైనది. సమశీతోష్ణ వాతావరణముతో, పెద్ద పెద్ద సరస్సులతో నారింజతోటలతో నిండియున్న ఈప్రాంతములో ప్రయాణము చేయుట యపూర్వమగు నానందమును గలుగజేయును. ధవళగిరి అన్నపూర్ణా మున్నగు హిమగిరి శిఖరముల నిసర్గ మనోహరత్వము యీస్థానమునుండి చక్కగ కనుగొనవచ్చును. దీనికి 60 మై. దూరమున హిమాలయ పర్వత శ్రేణులమధ్య మరమపవిత్ర క్షేత్రమగు ముక్తినాథము కలదు. ఇక్కడి ఉష్ణగుండము, ముక్తి క్షేత్రము హిందువులకు బౌద్ధులకుగూడ సమ్మాననీయములు.

గోర్ఖాపట్టణము — ఇది చరిత్రప్రసిద్ధమైన పట్టణము. జిల్లాకు ముఖ్యపట్టణముకూడ కాట్మండూకు పశ్చిమముగా 50 మై దూరమున హిమవన్నగాభిముఖముగా ఒకరమ్యమైన పర్వతముమీాద నిర్మింపబడిన పట్టణము. ఇక్కడి ప్రాచీన రాజసౌధము, మానకామన దేవాలయము, గోర్ఖానాథ దేవాలయము చూచి మెచ్చుకొనదగినవి.

త్రిశూలీబజారుపట్టణము:— ఈ పట్టణము కాట్మండూ నగరమునకు పశ్చిమముగా 25 మై. దూరమున త్రిశూలినది యొడ్డున గలదు. ఇది నేపాలు పశ్చిమప్రాంతమునకు సింహద్వారము వంటిది. ఇక్కడనుండి కాట్మండూకు మంచి రోడ్డు కలదు. నేపాలు సందర్శించినవారు కాట్మండూ నగరములోని హనుమాన్‌ధోకాను, నారాయణహితదర్బార్ (రాజమందిరము), సింఘాదర్బార్ (సచివాలయము), గడియార స్తంభము, భీమసేన శిఖరము, సింహాసతాల్, బసంతపూర్ దర్బార్,

లలితాపురములోని పతందర్బార్, నౌకటిలోని నౌకత్ దర్బార్, గోర్ఖాలోని గోర్ఖాదర్బారు మొదలగు మహా ప్రాసాదములను, గోసైక్ హిమాలయములలోని గోసైక్ గుండమును, కీర్తిపురములోని భాగ్భైరవుని, తౌలివాహా (ప్రాచీనకాల కపిలవస్తు) లోని లుంబినీవనమును, నంబూర స్తూపమును, గోలకభైరవుని తప్పక చూడవలయును.

## పశుపతినాథస్వామి

తస్యాదిదేవ దేవస్య మూర్త్యష్టకమయం జగత్,
తస్మిక్ వ్యాప్య స్థితం విశ్వం సూత్రే మణిగణా ఇవ.
శర్వో భవస్తథా రుద్ర ఉగ్రో భీమః పశుపతిః,
ఈశానశ్చ మహాదేవో మూర్తయశ్చాష్ట విశ్రుతాః.
భూమ్యంభోఽగ్నిమరుద్వ్యోమ క్షేత్రజ్ఞార్క నిశాకరాః,
అధిష్ఠాతా మహేశస్య శర్వాదే రష్టమూర్తిభిః.
అష్టమూర్త్యాత్మనా విశ్వ మధిష్ఠాయ స్థితం శివం
భజస్వ సర్వభావేన రుద్రం పరమకారణమ్. —శివపురాణము.



పశుపతినాథ మందిరము దూరదృశ్యము

నమశ్శివాయై చ నమశ్శివాయ.

కాట్మండూలో విష్ణుమతీనదీతీరమున ఆర్యాఘట్టమున పశుపతినాథ మందిరము గలదు. యాత్రికులు విష్ణుమతీ నది లందు స్నానముచేసి పశుపతినాథుని దర్శింతురు.

పశుపతినాథ శివలింగము పరశువేది యని కొందరందురు. కాని అది భ్రమమాత్రమె. ఇది పంచముఖి శివలింగము. శివుని యష్టమూర్తులయందు నొకటియై యున్నది. మహిషి రూపమునయున్న శంకరుని శిరోభాగముమాత్ర మీ మూర్తి యందు కన్పించును ఇది శంకరుని యజమాన స్వరూపము. ఈ మహాదేవు నారాధించుటకే యాత్రికులు తండతండము లుగా ననేకకష్టముల నెదుర్కొని యీ దేశమునకు వత్తురు.

శివరాత్రి సమయమున నీ మహాదేవుని సందర్శించుట కసంఖ్యాకులగు యాత్రికు లరుదెంతురు. యజమాన స్వరూపుడు, సకల జగదారాధ్యుడు నగు పశుపతినాథమహాదేవుని సందర్శించుటతో యాత్రికుల యాత్రాలక్ష్యము పరిపూర్ణ మైనను సాలగ్రామక్షేత్రమని ప్రసిద్ధిగాంచిన ముక్తినాథ మును, ఇంకను అన్యాన్య దేవాలయములను సాధ్యమైనంత వరకు వారు సందర్శించియే వెనుదిరుగుదురు. సమీపమునందే యొక మండపమున నందీశ్వరమూర్తి కలదు. పశుపతినాథ మందిరసమీపముననే విశాలమైన దేవీమందిరము కలదు.

గుహ్యేశ్వరీ:— పశుపతినాథ మందిరమునకు కొలది దూరమున గుహ్యేశ్వరీదేవి మందిరము కలదు. ఇది చాల విశాలమైన సుందరమైన దేవాలయము. ఇది ప్రసిద్ధములగు 51 శక్తిపీఠములం దొకటి సతీదేవి జానువులు (మోకాళ్ళు) యిచ్చట పడెను.

యాత్రికులు బసచేయుటకు పశుపతినాథమున చాల ధర్మశాలలు గలవు. నేడు ముజఫర్ పూరునుండి కాట్మండూ వరకు విమానముకూడ పోవుచున్నది.

బుద్ధనాథము:— ఇదియొక బుద్ధమందిరము, కాట్మండూ నగరమునకు 8½ మైళ్ల దూరమున గలదు కాట్మండూ నుండి మంచిరోడ్డు కలదు. క్రీ. శ. 7 వ శతాబ్దమునందు దీనిని మానదేవుడను రాజు కట్టించెను. శీతకాలమునందు టిబెట్టు దేశస్థులు చాలమంది యిచటకు యాత్రార్థమరుదెంచు చుందురు మందిరమునకు నాలుగువైపుల విశాలప్రాకారము కలదు. దీనిపై నసంఖ్యాకములగు అనుతాభ (బుద్ధ) మూర్తులు కలవు. నేపాలమునందుగల చాలదేవాలయములు హిందూ, బౌద్ధ శిల్పముల కలయికతో నిండియున్నవి. ఈ మందిరమునగూడ నట్టికలయిక చూడవచ్చును.

మత్స్యేంద్రనాథమందిరము:—ఈ మందిరము పాటణ నగరములో నున్నది. ఇదిగాక నిచ్చట నింకను ప్రాచీనాథునిక మందిరము లనేకము లున్నవి వీనిలో మత్స్యేంద్రనాథమంది రము (మీననాథమందిరము) అన్నివిధముల నందమైనది. ఈ యాలయము వాఙ్మతీనదీతీరమున గలదు. ఈ దేవుడు నేపాలదేశరక్షకుడు. ఇది బౌద్ధమందిరము ఇది శివాలయము వలె నుండును. దీని సౌందర్యము చూచినగాని నేత్రములకు సార్థక్యత లేదు. మిక్కిలి దట్టమైన భూరుహములు మందిర మును నానుకొనియుండుట యీ మందిర సహజసౌందర్య మును ఇనుమడింప చేయుచున్నది. ద్వారముల కిరుపార్శ్వము లందు దేవీదేవతలయొక్కయు, పశువులయొక్కయు చెక్క బడిన మూర్తుల శిల్పవిన్నాణముతో నలరారు చుండును. ఇచటనొక రాధాకృష్ణమందిరము కలదు. ఇది గాంధారశిల్ప సౌందర్యమునకు మచ్చుతునక.



గుహ్యేశ్వరీ ఆలయము - కాట్మండు.



పశుపతినాధాలయము (లోపలిదృశ్యము)
కాట్మండు.

సూర్యవినాయక మందిరములు:—


భవానీమందిరము

కాట్మండూనగరమునకు 6 మై. దూరమున ప్రాచీన నేపాళ్ రాజవంశీయుల రాజధాని యగు "భాట్‌గాంవ్"లో నీ మందిరము కలదు. ఈ నగరము పాటణ్ నగరముకంటె సుందరమైనది. ఇచటగల భవానీమందిరము మొదలగునవి యాత్రికులకు నేత్రోత్సవము కలిగించును. క్రీ.శ 1640–50 ప్రాంతములందు త్రవ్వబడిన సిద్ధసరోవరము భాట్‌గాంవ్‌కు పశ్చిమమున కలదు. ఇందు చీనాదేశపు స్వర్ణమత్స్యములు కలవు.

వినాయకమందిరము:—ఇది చాలసుందరమైనది. మందిరమున కెదుట నొక స్తూపము కలదు. దీని శిఖరమునం దొక పద్మము, దానిపై వినాయకుని వాహనమగు మూషికవిగ్రహము కలవు. దీనికి ఎడమవైపున నొక గంటకలదు. దానికి ప్రక్కగా చిన్నగంటలు చాల గలవు.

చంగునారాయణ మందిరము:— ఈ దేవాలయము కాట్మండూ నగరమునకు 10 మై. దూరమున గలదు. ఈ దేవాలయ సింహద్వారము మిక్కిలి యందమైనది. ఫ్రాన్సుదేశస్థుడగు సిలవాలేవిపండితు డీ ద్వారమును మిక్కిలి కొనియాడెను. నేపాలదేశములోని యాలయము లన్నిటికంటె యంద చందములలో నీ దేవాలయమే ప్రథమగణ్య మని యాతడు చెప్పెను.

ద్వారమున కిరుపార్శ్వము లందును పాషాణ స్తూపములపై శంఖచక్రములు కలవు. ఇవి క్రీ.శ. 496 లో కట్టబడినవని

సిలవాలేపీ నిర్ణయించెను. విదేశీయులెందరో యీ స్థలమును సందర్శించిరి. వారి దృష్టిలో నియ్యది నేపాలులో అందాల పాలవెల్లియై ఆనందదాయకమై యుండు స్థలములం దొకటి.

నారాయణచతుష్టయము — చంగునారాయణునకు సమీపమునందు విశంకునారాయణ, శిఖరనారాయణ, ఏచంగు నారాయణ అని 3 గ్రామములు కలవు. చంగునారాయణ మందిరముతో కలిపి యీ నాల్గు నారాయణ మందిరములు నొకేరోజున సందర్శించిన నధికపుణ్యము లభించునని చెప్పు దురు. ఈ నాల్గుగ్రామములను సందర్శించుటకు 22 మైళ్ళు నడువవలసియుండును. శ్రద్ధగల భక్తులు కష్టమునకోర్చి యీ నాల్గు నారాయణమందిరములను నొకేరోజున సందర్శింతురు.

శంకుగ్రామము — ఇది చంగునారాయణకు 3 మైళ్లు. ఇచట సిద్ధివినాయక మందిరము కలదు.

గోకర్ణము:— పశుపతి నాథమునకీశాన్యదిశయందు వాఙ్మతీ నదీతీరమునం దీ తీర్థము కలదు

బోధనాథమందిరము: — ఇది కాట్మాండూ, పశుపతి నాథములకు మధ్య కలదు. బౌద్ధులనేకు లిటకు వత్తురు.



బోధనాథ మందిరము

గోదావరి — "ఫూల్‌చోయా" అను పర్వత సమీపమునం దీనగరము కలదు. 12 సం.ల కొకసారి యిచట ఒక నెల పెద్ద యుత్సవము జరుగును. ఇచట గోదావరీనది గలదు. దక్షిణదేశమందలి గోదావరీనదికి, దీనికి భూగర్భము నుండి సంబంధమున్నదని జనుల విశ్వాసము.

నీలకంఠము:— ఈ గ్రామము శివపురీ శిఖరమునందున్నది. ఇచట నొక సరస్సు గలదు. దానికి మధ్యగా అండాకృతిగా నొక పెద్ద నీలిరంగు శివలింగము కలదు. ఈ శివలింగము సరస్సునందు అడుగునుండి పైవరకు గలదు. శ్రావణమునం దిచ్చట నుత్సవము జరుగును.

సరోవరమున కుత్తరమునందు ఉన్నత పర్వతపంక్తులు గలవు. ఆ పర్వత శిఖరములనుండి మూడుధారలు వేరొక సరోవరమున పడుచున్నవి దీనిని త్రిశూలధారయని పిలతురు. శంకరుడు వీనిని తన త్రిశూలమువలన నుద్భవింపజేసెనని చెప్పుదురు. ఇచ్చటినుండియే త్రిశూలగంగానది పుట్టుచున్నది. ఈ పర్వతోపరిభాగమున చిన్నవి, పెద్దవి మొత్తము 22 సరస్సు లున్నవి.

దేవీఘట్టము — నవకోటకు సుమారు 2 మై. దూరమున నిది కలదు. ఇచట త్రిశూలగంగా, సూర్యమతీనదులు కలియుచున్నవి. ఇచట నొక దేవీమందిరము, సూర్యమందిరము కలవు.

కీర్తిపురము :— ధాకాకోట గ్రామమునకు తూర్పు కొండలమీద కొన్ని గ్రామములు కలవు. ఆ గ్రామములలో కీర్తిపురము తలమానికము ఇచట నొక కోట యున్నది.

భైరవమందిరము కూడ గలదు. ఇది చాల పురాతనమైనది ఈ మందిరమునందలి ప్రధాన దేవతామూర్తి వ్యాఘ్రరూపమున నుండుట విశేషము. ఈ పరిసరములందు దీనికి చాల ప్రశస్తి కలదు.

విఘ్నేశ్వర మందిరము:— నవకోట్‌కు ఉత్తరమున నొక పర్వతమున విఘ్నేశ్వరమందిరము కలదు ఈ మందిరమునందు అష్టమాతృకల విగ్రహములుకూడ గలవు.

నవకోట్:— కాట్మండూ నగరమునకు తూర్పుగా 25 మై. దూరమున ఈ నగరము కలదు ఇచట భైరవీదేవీ మందిర మున్నది.

స్వయంభూనాధ్:— కాట్మండూకు పశ్చిమముగా 2 మై. దూరమున కొండమీాద యీా బౌద్ధమందిరము కలదు. 400 సోపానము లున్నవి. మొదటి మెట్టువద్ద బుద్ధవిగ్రహ మున్నది ఒక మెట్టువద్ద వజ్రధారియగు ఇంద్రుని విగ్రహము కూడా గలదు.

## దేవతా ఉత్సవములు - పూజలు

నేపాలులో దేవబ్రాహ్మణులయందు భక్తి యెక్కువగుటచే నసంఖ్యాకములగు దేవాలయములు కలవు. 2733 తీర్థక్షేత్రములుగాని దేవాలయములుగాని కలవు. వీనియందు పర్వములలో నుత్సవములు జరుగును. సాధారణముగ రోజుకు ఒకటి రెండు ఉత్సవములుండును. సంవత్సరములో కనీస మూఁడు నెలలు ఉత్సవముల క్రిందనే గడచును. కొన్ని ముఖ్య పర్వములను గుఱించి యీాక్రింద వ్రాయుచున్నాము.



స్వయంభూనాథాలయము (దూరదృశ్యము)



స్వయంభూనాథాలయ శిఖరదృశ్యము – కాట్మండు.

మత్స్యేంద్రనాథ యాత్ర:— మత్స్యేంద్రనాథ దేవ మందిరము భోగమతీ గ్రామమందు కలదు. అచ్చట లింగము స్థాపింపబడినది. వైశాఖ శుద్ధ పాడ్యమినుండి ఉత్సవము లారంభమగును. ఉత్సవదినములలో స్నానమైన తర్వాత రాజఖడ్గము పూజింపబడును. పూజ కాగానే మత్స్యేంద్ర నాథుని విగ్రహములను రథముపై పాటనమునకు గొనిపోవు దురు. ఒకమాసమైనతర్వాత పుణ్యదినమున శుభముహూర్త మున మరల వేగవతీగ్రామమునకు దీసికొనివచ్చి, ఆ విగ్రహ మున కొక కంబళిమునుగప్పి, అచ్చటచ్చట అందరముందర గుడ్డలు తీసివేసి విగ్రహమును జూపించెదరు. దీనియర్థమేమన స్వామివలెనే ప్రతివారును తమకున్న దానితో సంతుష్టి చెంది యుండవలెననియే. దీనికి గుదడీర్ఘూడా ఉత్సవమని పేరు.

వజ్రయోగినీ యాత్ర — ఇది బౌద్ధుల ఉత్సవము. బౌద్ధులేకాక హిందువులును ఈ దేవత నుపాసించెదరు. శిఢ్హా నగరమున మణిచూడపర్వతముపై నీ మందిరము కలదు. వైశాఖములో నీ యుత్సవ మారంభించెదరు. ఆ సమయమున ఒకమంచముపై వజ్రయోగినీమూర్తి నుంచి శిఢ్ఘా నగర ప్రదక్షిణము కావించెదరు. ఈ మందిరమున కెదురుగా ఖడ్గ యోగినీమందిరము కలదు. దేవికి ముందెల్లప్పుడును అగ్ని వెలుగుచుండును. ఒక మనుష్యునితల యాకారము నచ్చట నుంచెదరు.

గోధియామంగళము లేక ఘంటాకర్ణుడు:— ఘంటా కర్ణ రాక్షసుని దేశమునుండి వెడలగొట్టుటయే యీ ఉత్సవము యొక్క యభిప్రాయము. ఘంటాకర్ణునిబూజించిన పిల్లలను

జంపు రోగము రాదని బంగాళీములో ప్రవాదము కలదు. నేపాలబాలురు గడ్డితో నొక ప్రతిమనుజేసి అచ్చటచ్చటకు గొనిపోయి అడుగుకొందురు. ఉత్సవాంతమున బాలకులు ఆ విగ్రహామును దగులబెట్టి ఆనందపడుచుందురు. ఈ ఉత్సవము శ్రావణములో జరుగును.

రాఖిపూర్ణిమ:- శ్రావణపూర్ణిమ బౌద్ధులకు హిందువులకు ఉత్సవదినమేగాని వారి క్రియలు వేరువేరు. బౌద్ధులా దినమున పవిత్ర నదీస్నాన మొనర్చి దేవదర్శనమునకు మందిరములకు పోవుదురు. బ్రాహ్మణ పురోహితులు తమ శిష్యుల చేతులకు రంగుదారములనుగట్టి దక్షిణలను గొనుచుందురు. చాలమంది పుణ్యము సంపాదించుకొనుటకై గోసాయిధాక్ పర్వతసమీపస్థ నీలకంఠసరోవరమున స్నానమొనర్చెదరు.

నాగపంచమి:— ప్రతి సంవత్సరము శ్రావణ శుద్ధ పంచమి (నాగపంచమి) నాడు నాగులకు గరుడునకు యుద్ధము జరిగినదట. చంగూనారాయణ మందిరమున బ్రతిష్టింపబడిన గరుడమూర్తి శ్రమచే నున్నాడని పురోహితులు అంగవస్త్రములచే చెమట నద్దుదురు. ఈ వస్త్రముయొక్క దారము సర్పవిషమును హరింపగలదని వారి విశ్వాసము.

ఇంద్రయాత్ర:— ఇది భాద్రపదములో 8 దినములు జరుగును. మొదటిరోజున రాజమహాలుముందు పెద్దధ్వజము పాతి జండా ఎగురవేయుబడును. రాజుచే నియమింపబడిన నృత్యగాండ్రు రాజమహాలు చుట్టును నృత్యము చేయుదురు. అనంతచతుర్దశీ దినమున రాజు కన్యకలకు పూజచేయును. అంతట వారిని గ్రామములోనికి ఉత్సవముగ దీసికొనిపోవు

దురు. తిరిగిరాగానే సింహాసనముపై రాజునుగాని రాజఖడ్గ మునుగాని ఉంచెదరు. ఆయన నౌకరులందరును వారి కనేక కానుక లర్పించెదరు. ఆ దినముననే అదివరకున్న నేవారు రాజును జయించి పృథ్వీనారాయణుడు సింహాసనము నెక్కినా డట. ఆరోజున భూకంపమువచ్చిన నేపాలున కనిష్టమని వారి నమ్మకము. భూకంపమువచ్చిన మరల వారు 8 దినములు ఉత్సవము లొనర్తురు.

దశహారా:— ఇది మన దసరావలె దుర్గోత్సవము. ఇది ఆశ్వీజ శు॥ పాడ్యమి మొదలు 10 దినము లుండును. భారతదేశములో నితరస్థలములందువలె నిచ్చటను జరుగును. ఈ పదిదినములలో దేవీముందఱ భక్తితో పూజలు, బలులు జరుపబడును. కాని యిచట బెంగాలులోవలె మట్టివిగ్రహము చేయక పాలకులను స్థాపించి అందు పంచవిధ ధాన్యములను జల్లి పవిత్రనదీతీర్థములను జల్లుదురు. చివరకు శిష్యులు కొంత డబ్బు చెల్లించగా పురోహితు లాశీర్వచనము లొసంగెదరు.

దివాలీ లేక దీపావళీ:— ఈ రోజున లక్ష్మీపూజ జరు గును. ఆ రాజ్యములో జూదమాడుట తప్పు. శిక్షించెదరు. కాని యీ యుత్సవములో మూడు దినములుమాత్రము వారి యిష్టమువచ్చినట్లు జూదమాడవచ్చును. బజారులలో నెచ్చట చూచినను గుంపులే, డబ్బుతో జూదమాడుటయే గాక ఒకొక్కప్పుడు తమ భార్యలనుగూడ దానిలో నోడిపోవు చుందురు. కొందఱు తమ చేతులనుగూడ ఓడి తెగగొట్టించు కొందురు లేదా దానికి బదులుగా నతఁడు గెలిచిన డబ్బంతయు సమర్పించుకొందురు.

భాయీపూజ:— మనము దీనిని యమద్వితీయ యందుము. కార్తీక శుద్ధ చవితినాడు జరుగును. స్త్రీలందరు తమ సోదరులను బిలిచి విందుచేసి, గుడ్డలుపెట్టి, నొసట బొట్టుపెట్టి, మెడలో మాలలు వేయుదురు. సోదరులును తోబుట్టువులకు చీరె, రవిక లిత్తురు.

కార్తీకపూర్ణిమ:— ఈ పర్వోత్సవములో ఆ మాస మంతయు స్త్రీ పురుషాదులు కార్తీకస్నానముచేసి మాసోపవాసముందురు. కొందరు స్త్రీలు కేవలము పశుపతినాథుని అభిషేకజలమునుతప్ప ఇంకేమియు దీసికొనరు. కార్తీక పూర్ణిమనాడు ఉత్సవములు చేయుదురు. పశుపతినాథ దేవాలయ మంతయు దీపములతో నలంకరించి, రాత్రియంతయు నృత్యగానములతో కాలమును గడుపుదురు మరుసటిదినమున నీ మందిరమున్న పర్వతమువిూద వనసమారాధనము చేసికొని యింటికి పోవుదురు

వినాయక చతుర్థి:— మాఘమాసములో గణేశ పూజ జరుగును. పగలంతయు నుపవసించి, రాత్రి భోజనము లొనర్తురు.

పంచలింగభైరవయాత్ర:— ఆశ్వీజ శుక్ల పంచమికి ఈ ఉత్సవమారంభమగును. ఆ దినమున మహాభైరవుడువచ్చి ఖడ్గనీ లేక కాషాయనీదేవితో నా స్థానమున భోగవిలాస మొనర్చునట.

అమితాభ బుద్ధోత్సవము:— స్వయంభూనాథ దేవాలయమునుండి అనేక ప్రకారములగు పవిత్రసామగ్రిని అమితాభబుద్ధుని కిరీటమును గ్రహించి కాట్మాండులో నీ యుత్సవ

మును జేయుదురు. పూజ అయిన తర్వాత భాండాలను బౌద్ధ బ్రాహ్మణుల కన్నము, ఇంకననేక విధములగు పదార్థము లొసంగెదరు అనంతరము దేవోచ్ఛిష్ట నైవేద్యాదులు మార్గ మందు వేయబడును. ఆసమయమున వచ్చిన బౌద్ధసేవారులు పవిత్ర బుద్ధప్రసాదమును గ్రహించెదరు. అంతట భాండావారికి భోజనముపెట్టి అందరుకలిసి మార్గమున పోవుదురు.

స్వాయంభూమేళా:— అనగా స్వాయంభూ ఉత్పత్తియైన దినము. స్వాయంభూ జన్మదినమగు ఆశ్వీజశుద్ధ పూర్ణిమా దినమున నిది జరుగును. షష్ఠ ఋతుఆరంభమున అనగా జ్యేష్ఠము నుండి స్వాయంభూనాథ మందిర శిఖరాదులను గుడ్డతో కప్పుదురు. పర్వదినమున గుడ్డలు తీసివేయుదురు. బౌద్ధులకిది చాల పవిత్రదినము. ఆదినమున నేపాలులోని అందరి యిండ్లలోను బుద్ధపూజ జరుగును.

మత్స్యేంద్రనాథుని చిన్నయాత్ర:— కోటలో పద్మపాణి ఉత్సవమెట్లుజరుగునో యిచ్చటను సమంతభద్రుని ఉత్సవము జరుగును. సమంతభద్రుని పేరు నేపాలులో ప్రసిద్ధము కాకపోవుటచే దీనిని మత్స్యేంద్రనాథుని చిన్నయాత్రగా చెప్పుచుందురు. చైత్రశుద్ధ అష్టమీ దినమునుండి 4 దినము లిది జరుగును. దుర్దైవ వశమున రథము యిరుసు విరిగినను ఇంకేదైన విఘ్నము కలిగినను ఇంకొకరోజెక్కువ జరుగును. 1 వ దినమున రాణీపోఖరానుండి అసన్ తాల్ కును, 2 వ దినమున అసన్ తాల్ నుండి దర్బారునకును, మూడవ దినమున దర్బారునుండి లాఘువతాలుకును, నాల్గవ దినమున రథము మరల కోటకు చేరును.

ఇవికాక నేతాదేవియాత్ర, పశుపతినాథయాత్ర, సీథీ యాత్ర, ఖాండాయాత్ర, కిచాపూజ, వసంతోత్సవము, హోలీ, మాఘీపూర్ణిమ, ఘోడాయాత్ర, భైరవీయాత్ర, రథయాత్ర, మతజాతయాత్ర, శృంగబేరయాత్ర, లోకేశ్వర యాత్ర, రవసర్వలోకేశ్వరయాత్ర మొదలగునవి కలవు. ఈ యాత్రలనుగూర్చి స్కాందపురాణములో హిమవత్ఖండములో కొన్ని చెప్పబడినవి. నేపాలులోని ఉత్సవము లేవైన గానిందు — నృత్య, గాన, మాంసభోజన, మద్యపానాదు లెక్కువగ నుండును. నేపాలువారు శివరాత్రికి శివపూజ, రాత్రి జాగర ణాదు లొనర్చెదరు. అందరును వాఙ్మతీస్నానమునకు పోయి పశుపతినాథాలయమునకు బోవుచుందురు.

## ముక్తినాథము

ముక్తినాథము కాట్మండూ నగరమునకు 140 మైళ్లు. ముక్తినాథముపోవుటకు గోరఖ్‌పూరునుండియు నొకమార్గము కలదు. కాట్మండూనుండి పోఖరా వరకు విమానముమీద వెళ్లవచ్చును.

గోరఖ్‌పూరునుండి యైనచో నౌతన్వా స్టేషను వరకు రైలు, అటనుండి "భైరవహా" వరకు మోటారు. అక్కడ నుండి పొఖరావరకు విమానము. విమానముమీద ప్రయా ణము చేయుట కిష్టములేకున్నచో, గోరఖ్‌పూరు నుండి మోటారుమీద నేరుగా భైరవహావరకు ప్రయాణముచేసి అటనుండి "బుటవల్" వరకు బస్సుమీద వెళ్లవచ్చును. అటనుండి కాలినడక "పాలపా" "బాగ్‌తుంగ్" మీదుగా

వెళ్ళవలయును. ఈ మార్గమున ముక్తినాథమునకు 64 మైళ్లు నడువవలయును. ముక్తినాథమున ధర్మశాల కలదు. ఇది మందిరమున కొక మైలుదూరమున గలదు. పోఖరానుండి ముక్తినాథము.

| | | | |
|---|---|---|---|
| పోఖరా నుండి:— | నాగ్‌డాండా | 7 | మైళ్లు. |
| | ఘోరేపానీ | 9 | ,, |
| | దానభంసార్ | 9 | ,, |
| | టుకుచేబాజార్ | 11 | ,, |
| | ముక్తినాధము | 12 | ,, |

ఇది నడకప్రయాణము. ఈ మార్గమున ధర్మశాలలు లేవు. దుకానదారులయింట నాగుటకవకాశము లభించును. ముక్తినాథము చేరుటకు ముందుగనే కాగ్‌చేనీ తీర్థము కన్పించును.

## ముక్తినాధము - మాహాత్మ్యము

ముక్తినాథమును సాలగ్రామక్షేత్రమనికూడ పిలుతురు. విష్ణువు ఇచట పర్వతరూపమున నుండెను. శివుడు పర్వతస్థ లింగరూపమున నుండెను. గండకీ పులినతలమునందు, సమీప పర్వతములందు సాలగ్రామ శిలలు లభించును. ఇచటి శిల లన్నియు భగవత్స్వరూపములే. చక్రాంకిత విషయము చెప్ప నవసరములేదు. ఇచట పులహా, పులహాస్త్య మహార్షుల యాశ్రమములుండెడివి. సోమేశ్వర శివలింగము, రావణుడు ప్రభవింపజేసిన పవిత్రబాణగంగయు కలవు. దేవికా, గండకీ, చక్రానదీ సంగమ మిచట త్రివేణియై వెలయుచున్నది. ఈ

త్రివేణిలో స్నానతర్పణము లాచరించి శంకరుని పూజించిన వానికి పునర్జన్మ లేదు.

"తీర్థే త్రిధారే యః స్నాత్వా సంతర్ప్య పితృదేవతాః,
మహాయోగిన మభ్యర్చ్య న భూయో జన్మభాగ్భవేత్."
— వరాహపురాణము.

రాజర్షి యగు భరతుడు రాజ్యమువిడచి తపమాచరించిన దిచ్చటనే. ఇతడు మరుజన్మమున లేడియై పుట్టెను. అపుడుకూడ ఆయన మృగసమూహమును విడచి యిచటికే వచ్చెను. వరాహ పురాణానుసారముగ, ఏదోకల్పమున మకరగజేంద్రుల యుద్ధముకూడ నిచటనే జరిగెను. విష్ణువు కరిరాజవరదుడను బిరుదుపొందిన దిచ్చటనే.

గండకీనది దామోదరకుండమునుండి పుట్టుచున్నది. గండకీనదీతీరమునం దెంతవరకు సాలగ్రామములు లభించుచుండునో, అంతవరకు సాలగ్రామ క్షేత్రముగా తలపబడును. ఇచట సాలగ్రామము లనేకరకములు. రంగు, ఆకారము, చక్రము, ముఖము వీనిని బట్టి హరి, విష్ణు, కృష్ణ, రామ, నృసింహాత్మకములుగా భావింపబడును.

గండకీనదిని సాలగ్రామనది, నారాయణీనది యని కూడ పిలుతురు.

## గండకీ మాహాత్మ్యము

పూర్వము వైకుంఠమునందు సకల జగదధీశ్వరుడగు శ్రీహరి శేషశయనుడై యుండ దేవతలందఱు నాదేవదేవుని నుతించుటకై యేతెంచిరి. వారలు శ్రీహరి ననేకవిధముల

కీర్తించిరి. అంత దేవేంద్రుడు "వర్తమానమున భూలోకమునం దెవరును పతివ్రతలు గాన్పించుటలేదు. పతివ్రతామతల్లుల కిరవగు భారతవర్షము గూడ వ్యభిచార దోషభూయిష్ఠమై పాతివ్రత్య మహాత్త్వమునే విస్మరించినది" అనెను.

అంత దేవర్షియగు నారదుండు "వర్తమానమున భూలోకమున గండకియను వేశ్య యొకరితె మహాపతివ్రత కలదు" అనెను.

దానికి దేవతానీకమంతయు మందహాసభాసురవదనారవిందమై "వేశ్యయేమి? పాతివ్రత్యమేమి?" యని యీామత్పరిహాససూచన గావించెను.

అప్పుడు నారదుడు "అట్లుగాదు. వేశ్యలయందుగూడ పతివ్రతలున్నారు. ఏవేశ్య దినమున కొక్కరినే భర్తగా వరించి సర్వవిధముల నాతని సేవించునో, యావేశ్య పతివ్రతాతిలకమే యగును" అని ధర్మశాస్త్రమును వాకొనెను.

అంత శ్రీహరి "యాగండకీ పాతివ్రత్య మెట్టిదో పరిశీలింపవలసినదే. వెలయాండ్రకు దినమున కొక్కడే భర్తయను నియమముండుట యరుదు. ఎవరు రొక్క మెక్కువగా నిచ్చిన వారికే వారు శరీరమును విక్రయింతురు" అని పలికెను.

దేవతలును "గండకీ పాతివ్రత్యము పరీక్షింపదగినదే" యని ముక్తకంఠులై పలికిరి.

శ్రీ మహావిష్ణువు తానే యీ కార్యమును నిర్వర్తింతు నని పలికి, భూలోకమునకరుదెంచి వ్యాపారిరూపమున గండకి యింటికేగి యామె దినమున కెంతవెల తీసికొనునని ప్రశ్నింప

వేయి నిష్కములు వెలయని దాసీజనము తెలుపగా వ్యాపారి రూపమునసున్న శ్రీ మహావిష్ణువు వెంటనే సువర్ణనిష్కములు చెల్లించి లోనికేగెను. గండకియు నపరిమిత భక్తి తాత్పర్యములతో నా మాయామానుషరూపున కర్ఘ్యపాద్యముల నొసంగి స్వాగతమును బల్కెను.

ఆ వ్యాపారి (విష్ణువు) గండకివలన సేవాశుశ్రూషల నందుచు నుండగనే సర్వసైన్యాధ్యక్షుడు 5 వేల నిష్కముల నంపుచు తానీరోజు గండకియింట గడుపుదునని కబురంపెను. వేశ్యమాత ఆశాపూరితచిత్తయై గండకి నీవలకు బిలిచి 'యీ వ్యాపారిని తనిపివేయి, తనుపకనో సైన్యాధ్యక్షునకు స్వాగతమును బలుకుటకు సంసిద్ధవుగ' మ్మని చెప్పెను. కాని యామె యంగీకరింపలేదు

క్రమముగ నపరాహ్ణమయ్యెను. అంతలో కాశ్మీరాధీశుడు వివిధ స్వర్ణపాత్రికలందు బహుమూల్య వస్తునిచయము నుంచి లక్ష సువర్ణనిష్కముల నంపుచు తానీ దివసమును గండకియింట గడపుదునని కబురంపెను.

వెంటనే వేశ్యమాత 'రాజానుగ్రహమునకు పాత్రమవై వర్ధిల్లుదువు. ఈ దరిద్రపు వ్యాపారిని విడువుము.' అని కూతున కనేకవిధముల బోధించెను. కాని యామె యంగీకరింపలేదు. ఇంతలో నున్నటులుండి యా వ్యాపారికి వాంతులు విరోచనములు ప్రారంభమై కుష్ఠురోగము సద్యస్సంభూతమై శరీరమునందెల్లెడ వ్యాపింపదొడగెను దుర్వాసనతో నిండి సమీపించుటకే వీలులేని యాతని సేవగించుకొనక గండకి సర్వవిధముల నాతనికి బరిచర్య చేయదొడగెను. ఆమె వస్త్ర

ములుకూడ నాతని వమనములచే, రసిచే కలుషితములయ్యెను. అయినను ఆమె వాని సేవగించుకొనలేదు. క్రమముగ నా బేహారిని మృత్యువు సమీపించెను. ఆతని ప్రాణవాయువు లనంతమున లీనమయ్యెను. ఇది గాంచియు గండకి చెక్కు-చెదర లేదు.

ఎందరు వలదనుచున్నను, తల్లి గోల చేయుచున్నను గండకి యీ వ్యాపారిశరీరముతో సహగమనముచేయ నిశ్చయించి చితి నధిరోహించెను.

ఆమెపాతివ్రత్యమున కలరి, విష్ణువు "గండకీ! నీ వ్రత నిష్ఠకు మెచ్చుకొంటిని. నేటినుండి నీవు నదీరూపమునొంది లోకములను పునీతము చేయుచుందువు. నేనును సాలగ్రామ రూపుడనై నీయందు సదా నివసింతును. దర్శన, స్పర్శన, మార్జనములచే మహాపాపులనుకూడ పునీతుల జేయుచు నీవు సాలగ్రామనది యని విఖ్యాతినందుదువు" అని వరమొసంగెను.

ఉష్ణధారలు — ముక్తినాథక్షేత్రమున గండకీనది యందు 7 వేడి నీటిపాయలు కలియుచున్నవి. ఇందగ్నికుండ మను పాయ ఒక పర్వతమునుండి పుట్టుచున్నది. అది పుట్టు చోట నా పర్వతమునం దగ్నిజ్వాలలు కన్పించును. ముక్తి నాథమునం దనేకములు యితర దేవాలయములు ధర్మశాలలు కలవు. ముక్తినాథము 51 శక్తిపీఠములం దొకటి. ఇచట సతీదేవియొక్క కుడిచెంప పడెను. ఇచట నింకను తీర్థములు కలవు. వానిలో హరిహరప్రభ, అక్షయతీర్థము, హంసతీర్థ ములు ముఖ్యములు.

దామోదరకుండము.— ఇది ముక్తినాథమునకు 16 మైళ్ళు ఇచటకు వెడలుట కొరకు నిర్ణీతమార్గము లేదు. అందుచే మార్గదర్శకుని (కూలీని), భోజనసామగ్రిని, ఒక డేరాను 'టుకుచేబాజారు' నుండి వెంటబెట్టుకొని వెళ్ళవలయును. హిమవర్షము నమ్మరాలము. అది క్షణములో భయంకరరూపమును దాల్చును. రెండురోజులకు కృత్రిమ దామోదరకుండము జేరుదురు. మూడవరోజుకూడ ప్రయాణముచేసిన గండకీనది జన్మించు దామోదరకుండమును జేరుదురు. దామోదర కుండమునందు సజీవ సాలగ్రామములు (మిక్కిలి ప్రభావముకలవి) లభించునందురు. కాని ప్రాణములను కొరుకు చలి, భయంకరమగు మంచు, మార్గసౌకర్యము సరిగా లేకపోవుట వలన యాత్రికులు చాల నరుదుగా నీయాత్ర చేయుదురు.

*  *  *

కొలది సంవత్సరముల క్రిందనే నేపాల్‌చక్రవర్తి శ్రీ మహేంద్ర సతీసమేతముగా రెండుపర్యాయములు భారత దేశమునకువచ్చి, సుందర భారత దేశములోని అతిలోకమనోహరములగు సుందరదృశ్యములనుచూచి వెడలిరి — ప్రకృతి రామణీయకమునకు, గంభీరపర్వతపంక్తులకు, ప్రకృతిలోని సహజసంపదలకు నీ దేశము ప్రతిబింబము.

*  *  *



బుద్ధుని స్థూపము - కాట్మాండు



ఇంద్రోర్ చౌక్ - కాట్మాండు.

# ఉపసంహారము

పూర్వమునుండియు హిమవత్పర్వత, వింధ్యపర్వత మధ్యగతమైన దేశము ఆర్యావర్తమనియు పవిత్రస్థలమనియు వాసిగాంచినది. అందును భారతదేశమున కుత్తరదిశయందు పెట్టనికోడవలె పరివ్యాప్తమై యున్న హిమాలయపర్వత భాగములన్నియు పవిత్ర పుణ్యానదీనద విరాజితములై, నానా దేవీదేవతా -మందిరముల కావాసభూములై యున్నందున "కాశికేగుటయే కాటికేగుటగా" తలంపబడు నా ప్రాచీన సమయమునకూడ హిందువులకు యాత్రాభిగమ్యములై వరలినవి. ఆధునికముగ పెంపొందిన సౌకర్యములతో హిందువుల యం దధికసంఖ్యాకులకు హిమవత్పర్వతాధిత్యకా సంస్థితుడు, సర్వజగద్రక్షకుడు నగు శ్రీ బదరీనాథుని సందర్శించుట సులభమైనది. అట్లే కొలదికాలములో శ్రీ పశుపతినాథుని సందర్శించుటకూడ నేటికంటె సుగమము కావచ్చును. పూర్వము నుండియు భారతదేశగత రాజ్యములని చూర్ణికాదులయందు పేర్కొనబడిన 56 దేశములయందు నేపాలుదేశముయొక్క పేరుకూడ కానవచ్చుచున్నది. అందుచే నిది ప్రస్తుతము అన్యదేశమయినను ఒకప్పుడు నేటికంటె సన్నిహితమగు సంబంధము భారతదేశమునకు నీదేశమునకు మధ్య నెలకొనియుండెడిదని భావింపవచ్చును.

శ్రీ పశుపతినాథమహాదేవుని సందర్శించుటతో నుత్తరదిశయందు అభ్రంకషమైన శిఖరరాజములతో విరాజమానమైయుండు హిమవత్పర్వతశిఖరములు లోయలు పాదతలములు

అన్నియు మనకు చిరపరిచితములైనట్లు తోచును. కాయక్లేశమును మరపించు అపూర్వానందానుభూతితో హృదయము పులకరించును. అప్రయత్నముగనే మానవుని మానసము భగవత్పాదపద్మముల దెస కాకృష్టమగును. కన్నుల నానందాశ్రులు జాలువారుచుండ భావవిస్మితశరీరుడైన యాత్రికుని నోటినుండి "జయ! పశుపతినాథ మహాదేవ!" అను పలుకులు వెలువడును. హృదయమున స్థిరమగు భక్తిభావము నెలకొనును. అందుచేతనే కదా "తీర్థానిసేవేత సమాహితాత్మా" యని ప్రాచీనఋషులు మనకాదేశించియున్నారు!

నేపాలును సందర్శించనిదే, పశుపతినాథుని సేవించనిదే, హిమాలయోత్తుంగ శృంగ సహజ రామణీయకమును కన్నులార గాంచనిదే భారతీయుల జన్మ సార్థకము కాదు. పూర్ణయాత్రా ఫలము సిద్ధించదు.

యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం
యా హవిర్యా చ హోత్రీ
యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా
యా స్థితా వ్యాప్యవిశ్వమ్,
యా మాహుః సర్వబీజప్రకృతిరితి యయా
ప్రాణినః ప్రాణవంతః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతు వ
స్తాభి రష్టాభి రీశః. — కాళిదాసు.

స్వస్తి
జయ! శ్రీ పశుపతినాథమహాదేవ్.



# సింహావలోకనము

పశుపతీందుపతిం ధరణీపతిం భుజగలోకపతిం చ సతీపతిం,
ప్రణత భక్త జనార్తిహారం పరం భజత రే మనుజాగిరిజాపతిమ్.

నేపాల్ దేశము హిమాలయపర్వత పాదములవద్దనున్న స్వతంత్ర దేశము. ఇక్కడి ప్రకృతిసౌందర్యము అపురూపము, అనుపమము. ఇక్కడి ప్రజలు కళాహృదయము, శిల్పవిజ్ఞానము కల నేర్పరులు. ముఖ్యముగా నేవారులు ఇట్టివారు.

## ఉత్పత్తి

నేపాల్ పుట్టుకనుగూర్చి అనేక ఐతిహ్యములు గలవు. స్వయంభూ పురాణములో చెప్పనప్రకారము నేపాల్ లోయ సాంద్రారణ్యమైన, పర్వతప్రాకారమైన, అగాధమైన సరస్సుగా నుండెడిది. ఆ సరస్సు పేరు నాగవాస సరోవరము. ఇది యింద్రసరస్సుతో తుల్యమైనదిగా నుండెడిది. దీనిలో అనేకములైన జలపక్షులు నివసించుచుండెడివి. ఇక్కడ ఒక పద్మముతప్పసకలవిధములైనభూరుహములు పెరుగుచుండెడివి. ఒకసారి విపాసీబుద్ధుడు చాలమంది శిష్యులతో కలిసి దేశాటనచేయు సందర్భమున నాగవాస సరస్తీరమునకు వచ్చి విడిసియుండగా ఒకసంఘటన జరిగెను. ఆతడు నాగవాససరస్సులో ముమ్మారు స్నానముచేసి, శుచిర్భూతుడై సరస్సునకు ముమ్మారు ప్రదక్షిణము చేసి, సరస్సునకు నైఋతివైపున పద్మాసనాశీనుడై, ఒక తామరదుంపను అనేకమారులు మంత్రించి నీటిలోనికి విసరివైచుచు "ఏనాడు ఈ తామర దుంప మొలకెత్తి పువ్వుపూయునో, ఆరోజుననే అగ్నిష్ఠ

భువననాథుడైన స్వాయంభూదేవుడు ఈ పద్మమున అవతరించి అగ్నిజ్వాలలరూపమున ప్రత్యక్షమగును. అప్పటినుండి యీ సరస్సు సస్యశ్యామలమై, సంకీర్ణజనావాసముగా మారిపోవు" నని ముమ్మారుచ్చరించి విపస్యబుద్ధుడు తనత్రోవ దానేగెను. పిమ్మట కొంతకాలమునకు అటులనే జరిగెను.

ఇంకొక గాథ. విపస్యబుద్ధుని తరువాత సిఖిబుద్ధుడు తన అనుచరులతో వచ్చి నాగవాస సరస్సును ముమ్మారు చుట్టి, "స్వాయంభూనాథుని దయవలన ఈ ప్రదేశమంతయు అచిరకాలముననే జనాకీర్ణము కాగలదనియు, నేల నాలుగు చెరగులనుండి ప్రజలు ఇక్కడకు రాగలరనియు శిష్యులతో మీరందరు ఇక శలవు తీసికొని మీమీ స్వస్థలములకు పోవలె ననియు" ఆనతిచ్చి దోసిలిలో తామరపువ్వు నుంచుకొని నాగవాస సరస్సులో దుమికెను. అంతట నాతని ఆత్మ స్వాయంభూనాథునిలో లీనమయ్యెను.

వేరొక కథ. సిఖిబుద్ధుని తరువాత చాలకాలమునకు విశ్వాబుద్ధుడు ఇక్కడికి వచ్చి, నాగవాససరస్సును చూచి యిట్లనెనట. "ఈసరస్సులో 'ప్రజ్ఞాసురూపగుహ్యేశ్వరి' ఉదయించగలదనియు, ఒక బోధిసత్వుడామెను సరస్సునుండి బయటకు తీసుకువచ్చి ప్రతిష్ఠించగలడనియు, ఆపిమ్మట ఈ స్థానము స్వాయంభూదేవుని దయవలన సర్వతీర్థములకు నిలయము కాగలదనియు" పలికి సరస్సునకు ముమ్మారు ప్రదక్షిణముచేసి స్వస్థలమునకు వెడలెనట.

ఈ కథలోని బోధిసత్వుడే మంజుశ్రీ. విశ్వాబుద్ధుని నాగవాస సరస్సును సందర్శించిన తరువాత మంజుశ్రీ తన

దివ్యదృష్టిచే స్వయంభూదేవుడు శిఖారూపమున అవతరించిన విషయమును తెలుసుకొని, ఆదైవముద్భవించిన స్థానమును తెలిసికొనిన ఎడల ప్రపంచములో తన పేరు చిరస్థాయి కాగలదని ఆశతో శిష్యులతో కలిసి బయలుదేరెను. వీరిలో ధర్మకారుడనురాజు, అనేకమంది రైతులు కలరు. వీరందరు కలసి నాగవాస తీర్థమున కేతెంచి స్వయంభూనాథుని గురించి ప్రార్థించిరి. తీర్థముయొక్క రెండవ ప్రదక్షిణములో మంజుశ్రీ దక్షిణపర్వత ప్రాకారమును చేరుకొని తన యోగదండముతో పర్వతమును ఒకపోటు పొడవగా, ఆ పర్వతము పగిలెను. అట్లు ఏర్పడిన పగులునుండి సరస్సులోని నీరంతయుపోయి నేల ఎండిపోయెను. అంతట నాయన పర్వతముదిగి ఈ లోయలో నలువైపుల సంచరించెను. ఈ పర్వతప్రాకారములో మంజుశ్రీ కత్తిదెబ్బవలన ఏర్పడిన గండిని 'కోట్‌బార్' అని ఈనాటికిని అందురు. ఇది ఫుల్‌చోవా, చంపాదేవి కొండలమధ్య గల గండి. ఈ కనుమద్వారానే భాగ్మతీనది లోయనుంచి వెలువడు చున్నది. ఇది పూర్వము సరోవరగర్భమని ఆధునిక భూతత్వవేత్తలు కూడ నిరూపించియున్నారు.

## ప్రధాన దేవతలు

కాట్మండూనగరము సన్నని పొడుగు కత్తివలె నుండును. దీనికి యెనిమిదిమైళ్లు తూర్పున భద్గాం బస్తీ గలదు. ఇది పూర్వపు రాజధాని. ఇది విష్ణువు చక్రరూపమున గుండ్రముగా నున్నది. కాట్మండూకు 2 మై. దూరమున ఉన్న ప్రాచీన రాజధాని యగు పాటన్ పట్నము శంఖరూపమున

గలదు. దీని పరిసరములోనే వాఙ్మతి, విష్ణుమతి, మంచ్రా అను మూడునదులు కలవు. ఈ మూడును ఉత్తరము నుండి దక్షిణమునకు ప్రవహించుచు, పోనుపోను చివరకు గండకీ నదిలో కలిసిపోవుచున్నవి. కాట్మండూకు 2 మై. తూర్పున ఒక పర్వతశిఖరముపై బౌద్ధులకు అత్యంత ప్రధానమయిన సింహానాథదేవాలయము కలదు. దీనికి సరిగా పశ్చిమముగా 8 మై. దూరమున హిందువులకు అత్యంత పవిత్రమైన చంగు నారాయణ దేవాలయము కలదు. పశుపతివద్ద గల మహా శ్మశానము సుప్రసిద్ధమైనది. బోధనాథదేవాలయ శిఖరముపై నలువైపుల నమర్చిన మైనములు, బాలాజీ మత్స్యగుండము అన్నియును కాట్మండూసమీపమునగల ఏ కొండకొమ్ముపై ఎక్కి చూచినను నేత్రానందముగ గోచరమగును. నేపాలు వంటి చిన్న దేశములో మొత్తముమీద 2733 దేవాలయము లున్నవన్న ఇక్కడి ప్రజల భక్తిశ్రద్ధల నూహించుకొన వచ్చును.

## చక్రవర్తులు – పరిపాలన

నేపాల్ చరిత్ర బహు ప్రాచీనమైనది. దీని ప్రాచీన చరిత్ర యంతయు పురాణవాఙ్మయమునకు సంబంధించినది. రాజులు రారాజులు దేవతలు అందరు నేపాలును పరిపాలించి నట్లు కనబడుచున్నది. ద్వాపరయుగము 15000 వ సం॥లో కిరాటులు నేపాలునకు వచ్చి తమరాజ్యమునుస్థాపించి పదివేల సంవత్సరములు పరిపాలించినారు. వీరితరువాత ధర్మదత్తుడను రాజు వేయిసంవత్సరములు రాజ్యమును పరిపాలించినాడు. ఆతరువాత వేయిసంవత్సరాలు ఆ రాజ్యమునకు రాజే లేడు.

రాజధానియైన విశాలనగరము రెండువేల సంవత్సరములు వర్ధిల్లినది ఈ విధముగా పుక్కిటిపురాణములపై కట్టుకథలతో నిండియున్న నేపాల్ చరిత్రలో ముఖ్యమైన సంఘటనలు రెండు. అందులో నొకటి క్రీ.పూ. 5 వ శతాబ్దమున బుద్ధుడు నేపాల్ లోయను సందర్శించెను. అపుడు దేశము కిరాటరాజు పరిపాలనలో ఉన్నది. ప్రజల మతము హిందీమతము. సంస్కృతియంతయు బ్రాహ్మణసంస్కృతి. బుద్ధుడు నేపాల్ లోయలోగల పుణ్యక్షేత్రముల నన్నింటిని కాలినడకను తిరిగి సందర్శించెను. ఆయన అక్కడనున్న స్వల్పకాలములో దాదాపు వేయిమంది బ్రాహ్మణక్షత్రియులు ఆయనకు శిష్యులైరట. ఇది క్రీ. పూ. 490 ప్రాంతములో కిరాటరాజైన జితదేశి పాలనలో జరిగినదట. ఈయన మహాభారత యుద్ధములో కౌరవులకు వ్యతిరేకముగా పానిపట్టువరకు పురోగమించి అక్కడే ఘోరసంగ్రామములో అసువులు బాసినాడట.

ఆతరువాత చెప్పదగిన మరొకచారిత్రకసంఘటన క్రీ.పూ. 249 లో అశోక చక్రవర్తి నేపాల్ లోని బౌద్ధక్షేత్రముల నన్నిటిని సందర్శించి, తన యాత్రా స్మృతిచిహ్నముగా కాట్మండూకు ఆగ్నేయముగా 2 మై. దూరములో నున్న లలితపత్తనపట్టణానికి శంకుస్థాపన చేసినాడు. ఈపట్టణమధ్యలో దర్బారు, దక్షిణమున అశోకచక్రవర్తికట్టించిన దేవాలయము నేటికిని కనులపండువుగా కనబడుచున్నది. కిరాటరాజుల తరువాత సూర్యవంశజులైన రాజపుత్రరాజులు దేశమును పరిపాలించినారు. వారితరువాత క్రీ.శ. 6 వ శతాబ్దము చివర ఉజ్జయినిరాజైన విక్రమాదిత్యుడు నేపాల్ దేశమును జయించి

నాడు. ఈయన గొప్ప హిందూమతాభిమాని; కాని బుద్ధుల నెన్నడు హింసించలేదు. ఈయనతరువాత రాకూరివంశస్థులు పరిపాలించినారు. ఇక్కడి ప్రధాన దేవాలయములలో బౌద్ధమతము, బ్రాహ్మణమతము సమఉజ్జీలుగా అభివృద్ధిచెందినవి. వ్యాపారము, వ్యవసాయము బాగా అభివృద్ధిచెందినవి. దేశములో ననేకవందల మఠములు, దేవాలయములు నిర్మింపబడినవి. ఒక్కమాటలో చెప్పవలయునన్న 1500 సంవత్సరములనాడే నేపాల్ దేశము విశేషముగా నభివృద్ధిచెందినది. నాటి నేపాల్‌కు నేటి నేపాల్‌కు విశేషమైన తారతమ్యమేమియును లేదు.

క్రీ.శ. 1324 వ సం॥లో అయోధ్యరాజైన హరిసింగ్ దేవుడు నేపాల్‌లోయలో తమ పరిపాలన నెలకొల్పెను. ఆ తరువాత 1386 ప్రాంతములో నేపాల్ రాజరికము తిరిగి మల్లరాజులకే సంక్రమించినది. వీరిలో మొదటివాడు జయస్థితిమల్లుడు. ఈయన 43 సం॥లు ప్రజలను చల్లగా పరిపాలించినారు. 1480 లో ఈయనతరువాత రాజైన యక్షమల్లుడు రాజ్యమును వారసులందరికి పంచిపెట్టుటచే దేశము మూడుభాగములుగా చీలినది. అపుడు పాటణ్, భద్గావ్, కాట్మండు అను మూడు వేర్వేరు రాజధానులేర్పడి దేశము పరిపాలింపబడుచుండెడిది. పిమ్మట 300 సం॥ల తరువాత, క్రీ.శ. 1768లో గూర్ఖాలు ఈదేశమును పూర్తిగాజయించిరి. వీరు రాజపుత్రస్థానములోని చిత్తూరు ప్రాంతమువారు. వీరు 1768 లో పృథ్వీనారాయణ్ అను చక్రవర్తి నాయకత్వమున కాట్మండునగరమును వశపరచుకొనిరి. పిమ్మట 1816 లో

బ్రిటిష్ ప్రభుత్వముతో జరిగిన సంధిప్రకారము నేపాల్ బ్రిటిష్ వారి రక్షణక్రింద స్వతంత్రరాజ్యముగా నున్నది. నాటినుండి నేటివరకు నేపాల్ దేశచరిత్రలో చెప్పదగిన సంఘటనలేమియు జరుగలేదు. ఇది నేపాల్ దేశముయొక్కయు, రాజుల యొక్కయు సంగ్రహచరిత్ర.

నేపాల్ ప్రజల మతము, ఆచారవ్యవహారములు, వేష భాషలు, కల్లుపరిశ్రమలు, పల్లెలు బస్తీలు అన్నియు నించు మించు వేయిసంవత్సరములనాడెటులుండెనో, నేడును అటు లనే యున్నది. ఇందులకు కారణము దేశము నైసర్గికముగా దుర్గమముగా నుండుటయే. ఇక్కడి ప్రజలలో నేవారులు కళాకారులు. గూర్ఖాలు పరాక్రమవంతులు. ఇచ్చటి ప్రజలు మైథిలి, భోజపురి, మాగధి, అవధి భాషలు మాట్లాడుదురు. నాగరలిపిలో వ్రాసిన పార్వతీయభాష వీరి వ్యాపారభాష. నేపాలీభాష రాజభాష. ఇది ఉందరకు తెలియును.

## ముఖ్యపట్టణములు – రాజధానులు

నేపాల్‌లో ఉన్న ముఖ్యపట్టణములు మూడు. కాట్మండు, భట్గాన్, పాటన్. ఇవి లోయలో నొకదానికొకటి సమీపముగా కొలదిమైళ్ల దూరమున గలవు. 1767 నుండి నేటి వరకు కాట్మండు నగరమే దేశమునకు రాజధాని. మిగిలిన రెండు పట్టణములు కొంచెము సిథిలావస్థలో నున్నప్పటికిని శిల్పవైభవముతో చూపరులకు కాలవైభవముగ నున్నవి. ఇక్కడ దారు, లోహములమీద చెక్కడపు పనులు చేసెడి వా రెక్కువ. ఈ మూడు నగరములలో నేపాల్ నగరము

కత్తివలెను, భద్గాఁ శంఖమువలెను, పతన్ చక్రమువలెను నిర్మింపబడియుండుట గమనార్హము. కాట్మాండు నగరము క్రీ. శ. 724 ప్రాంతమున నిర్మింపబడినది. ఖత్ - మండు, ఖత్ = కొయ్య, మండు = దేవాలయము. (ఖట్మండు) పూర్వము దీనిని మంజుశ్రీ పేర మంజుపట్టణ మనిడివారు.

ఇచ్చట నన్నిటికంటె మిక్కిలి యాకర్షణీయమైనవి, రాజుగారి దర్బారు, దానికి ఉత్తరమునగల తలేజు దేవాలయము ఈ యాలయములోని దేవతపేరు తులజాదేవి. ఈమె రాజవంశమునకు కులదేవత. కాట్మండును జయించిన పృథ్వీనారాయణ, ఈ దేవికి నొకసారి నరబలి నివ్వగా, ఆమె ఆ రాజునకు స్వప్నమున కనబడి తన యసమర్థతను తెలియ జేసినదట. భద్గాన్‌లోని "తోమారితోలు" అనబడు భవానీ దేవాలయము కడు ప్రసిద్ధమైనది. కీర్తిపురము కాట్మండూకు ఉత్తరముగా 3 మైళ్ల దూరములో గలదు. ఇక్కడ పురావైభవ చిహ్నములు లెక్కకు మిక్కిలిగా కలవు దీనినే 'నస్తకపురము' లేక 'కోసిన ముక్కులపట్టణ' మనియు నందురు. ఇక్కడ జరిగిన ఒకయుద్ధములో పృథ్వీనారాయణరాజుయొక్క స్నేహితుడైన, సూరప్రతాప్‌షా కన్ను ఒకటి పోయినది. దీనికితోడు ముట్టడి చిరకాలము జరుగుటచే చివరికి విసిగి వేసారి నగరములో పదిరెండేళ్లు పైబడ్డ ప్రతిమగవాని ముక్కులు, పెదవులు కోసివేయమని శాసించెను. ఈ యుత్తరువు ప్రకారము ఒకసన్నాయియూదు మనుష్యునకు తప్ప మిగిలినవారందరికి ముక్కులు, పెదవులు కోసివేసినారు. ఈ విధముగా, 865 ప్రజల ముక్కులు,

పెదవులు కోసి తూచగా, అవి ఎనుబది సౌనులు తూగెనట. ఇక్కడి ప్రధానదేవాలయము భాగ్భైరవదేవాలయము. ఇది అత్యంతము పవిత్రమైన దేవాలయము.

## ప్రధాన దేవాలయములు

కాట్మాండూకు మూడుమైళ్ళు ఈశాన్యముగా వాఘ్మతీ నదియొడ్డున గల దేవాలయాల సమూహమునే పశుపతి యందురు. ఇక్కడ నది యొక్క చిన్న కనుమద్వారా నీడ లోయలో ప్రవేశించుచున్నది. పశుపతిని మృత్యుద్వారమని కూడ ననెదరు. మహత్తర సుకృతమున్నగాని యిచ్చట యసువులు విడచు అదృష్టము లభించదని హిందువులందరి విశ్వాసము. ఇక్కడి దేవాలయములు, సౌధములు, గోపుర ములు, బ్రహ్మాండమైన బంగారుపూత పూసిన నంది భక్తులకు కనులపండువుగా దర్శనమిచ్చుచుండును. ఇది అచ్చపు బంగా రపు నందే యని చాలమంది భావించుచుందురు. పశుపతి నాథుని సందర్శించుట మానవజీవితములో నత్యంత పుణ్యతమ మైన కార్యమని ఇక్కడి ప్రజల విశ్వాసము.

చంగూనారాయణ దేవాలయము కాట్మాండూకు తూర్పుగా 8 మై. దూరము పయనించిన మంచ్రానది దర్శన మగును దీనిప్రక్కనే ఒక పర్వతముమీద నున్న విష్ణు దేవాలయమునే చంగూనారాయణ దేవాలయ మందురు. కాట్మాండూకు 44 మై. పరిధిలో నాలుగు చిన్న చిన్న దేవా లయములుగలవు. ఈనాలుగింటిని ఒక్కరోజుననే ప్రదక్షిణము చేసివచ్చుట పుణ్యమని యాత్రికుల విశ్వాసము వీటినన్నిటి

లోను చంగుదగ్గర నున్న దేవాలయము ఇక్కడ ప్రసిద్ధమైనది, శక్తివంతమైనది. పూర్వమిక్కడ ఒకతులము బంగారము కానుక యిచ్చినయెడల దేవదర్శనము అగుచుండెడిదట. నేపాలునందున్నన్ని విగ్రహములు మరేదేశములోను లేవు. ఏమూల చూచినను, జలాశయమో గుడియో, గోపురమో, విగ్రహమో ఏదోయొకటి కనిపించుచునేయుండును ఈచంగూనారాయణ దేవాలయముయొక్క శిల్పసౌందర్యము అపూర్వముగా, అమోఘముగా కనులపండువుగా నుండును. దీనినానుకొని యొక ధర్మశాలయు కలదు. నేపాలులోని దేవాలయా లన్నిటిలోకి ఎక్కువ ధనవంతమైన దేవాలయము ఈ దేవాలయమే. వెన్నెలలో ఈ దేవాలయపుశోభ వర్ణనాతీతముగా నుండును మొత్తముమీద నేపాలులో ఇళ్ళెన్నోగుళ్ళన్ని. మనుష్యులెందరో విగ్రహాలన్ని. అక్కడ యొకనదిగాని, ఊటగాని, నీటిబుగ్గగాని, కొండగాని, గుట్టగాని హిందూదేవునికో, బౌద్ధదేవునికో అంకితము చేయబడనిది యొక్కటియు లేదనిన యతిశయోక్తి కాదు. అక్కడ ప్రతిస్థలము పవిత్రమైనదే. అటులనే ప్రతిరోజు కూడ ఏదోయొకపర్వదినమే.

## ఉత్సవములు - జాతరలు

ఇక్కడి పండుగలలో చాలా ముఖ్యమైనవి దసరా, మత్స్యేంద్రనాథుని జాతర. దేశము మొత్తముమీద ముఖ్యమైన పండుగలు పది. మత్స్యేంద్రనాథుడు నేపాల్ రక్షకుడు. ఈ మత్స్యేంద్రనాథుని యాత్ర మూడు దశలుగా జరుగును. మొదటిఘట్టము అభిషేకము. రెండవఘట్టము రథయాత్ర,

మూడవఘట్టము ఆభరణప్రదర్శనము. ఇక్కడ రథము చాల పెద్దది దీనిపై చెక్కడపుపని సున్నితముగాను, అందముగాను రాగిపూతతో, లోహఛత్రముతో కనులవై భవముగా నుండును. ఈ యుత్సవాని కనేక వేలమంది చేరుచుందురు. దసరా సందర్భములో నింటింటా దుర్గపూజలు జరుగును. కాట్మండూలోని పెద్ద మైదానములో సైనిక విన్యాసములు కూడ జరుగును. దసరాదినములలో ఇక్కడి ప్రజలు రెండు దినములపాటు తాము పాటించు మతవిధులలో ముఖ్యమైనవి రెండు. ఒకటి కాకబలి, రెండవది సేనబలి. కాకబలిరోజున రకరకములైన భక్ష్యములను తయారుచేసి కాకులకు వేయుదురు. సేనబలిరోజున అదేవిధముగ కుక్కలకు వేయుదురు.

## నీలకంఠమూర్తి

ఇక్కడి సరస్సులలో నత్యంత పవిత్రమైనది, దుర్గమ పర్వతప్రాకారపరివేష్టితమైనది గోసాయినాథుని సరస్సు. నేపాల్ లోయకు ఉత్తరముగా సరస్సుమధ్యకల నీలకంఠమూర్తి శిల మిక్కిలి పవిత్రమైనదిగా నందరు భావించెదరు. దీనిని ఈ రూపములో దేవతలే తీర్చి దిద్దిరని ఐతిహ్యము. కాట్మండునుండి మంచుకొండలమధ్యలో తీవ్రమైన చలిబాధకు తట్టుకొని ఎనిమిదిరోజులపాటు నడిచివెళ్లిన ఈ నీలకంఠస్వామి దర్శనము లభించును. ఈ గోసాయినాథసరస్సులో నీలకంఠేశ్వర సందర్శనమునకు పోవుట. కాశ్మీరులో అమరనాథ యాత్ర చేయుటకంటెను, కాంగ్రాలో జ్వాలాముఖినాథుని సందర్శించుటకంటెను, బహు కష్టసాధ్యమనియు, ఎంతో

అదృష్టవంతులకు పుణ్యావంతులకుగాని ఈ సుదృశ్యము దక్క దనియు చెప్పవచ్చును. నేపాల్ లోని ఊరూర పల్లెపల్లెన చెరువులు, నీటిబుగ్గలు, నదులు, నీటి ప్రవాహములు హెచ్చుగా కలవు. వీటిలో కొన్ని అతి ప్రాచీనమైనవి. కాట్మండులోను తదితర ముఖ్యపట్టణములలోను చెరువులు, నీటిబుగ్గలు అనేకముగా కలవు. ప్రతి నీటిబుగ్గ చెంతను ఏదో యొక దేవతామూర్తి కలదు

## బాలాజీ జలోద్యానము

కాట్మండూకు వెలుపల రెండున్నర మైళ్ళ దూరమున కొండలచెంత మనోహరమయిన బాలాజీ జలోద్యానము గలదు. ఇక్కడి నీటిబుగ్గ నిత్యావాహిని. ఈ నీటిని చిన్న చిన్న తటాకములవలె తీర్చిదిద్దినారు వీటిలో అందమైన చేపలను పెంచుచుందురు. యాత్రికులు వీటికి ఆహారము వేయుచుం దురు. ఈ సరస్సులలో ఒక వైపున దేవతలు కొలువుతీరి యున్నట్లు చెక్కబడినది. ఒకవరుసన యిరువది మకర ముఖ ములనుండి జలధారలు క్రిందనున్న సరస్సులోనికి పడునట్లు మలచబడినవి. వీటినుండి వెడలు జలము శీతలముగాను, మధు రముగాను శ్రమాపనోదముగాను ఉండును. బాలాజీ గొప్ప పుణ్యతీర్థము. ఇక్కడొక చిన్న తటాకమధ్య శేషతల్పశాయి యగు నారాయణుడు నీటిమీద తేలుచు నిద్రించుచున్నట్లు అమర్చబడి యున్నది శిరస్సుగాక మిగలిన శరీరమంతయు నీటిలోనొక అంగుళము మేర మునిగియుండును. ఈ నీరు మెల్ల మెల్లగా కదులుచున్న దృశ్యమును చూచిన — జలశాయ

నముచేసిన స్వామి ఉచ్ఛ్వాస తీసికొనుచున్నటుల కనుపించును. స్వామి విగ్రహము పది అడుగులు పొడవు ఉండును. ఈ విగ్రహమునకు నాలుగువైపుల సుందరమైన శాలి స్తంభములు గలవు. వాటిని చూచిన స్వామి చంద్రకాంతశిలా నిర్మితమైన పందిరిమంచముపై జలమధ్యమున శేషపాన్పుపై పవ్వళించినట్లు కనిపించును. ఇది చూచినవారికి ఆనంద పారవశ్యమున శరీరము పులకరించును. తన్ను చూడవచ్చినవారిని చిరునవ్వుతో స్వామి యనుగ్రహించుచున్నట్లు కనబడును. రెండువందల సంవత్సరాలుగా స్వామి వచ్చినవా రందరినీ అనుగ్రహించుచునే యుండెను. నేపాల్ లోయలో నున్న ప్రధాన దేవాలయములు రెండు. బోధనాథ, శంభునాధాలయములు. పతన్ పట్టణములోగల విహారము లన్నిటిలోను అతిప్రధానమైనది "ఉంకోవిహార్" లేక "రుద్రవర్ణ మహావిహారము". ఇక్కడి శిల్పసంపద యద్భుతమైనది. అవశ్యము చూచితీరవలసినది.

ఈ విధముగా హిందూ, బౌద్ధమత దేవాలయ సమ్మైక్యత కాకరమైన నేపాలు దేశమునందు పవిత్ర గండకీ నదీ స్నానపూర్వకముగ పశుపతినాధుని దివ్యదర్శనము చేయజాలని మానవుని జన్మము వ్యర్థమనుట సాహసముకానేరదు.

హరి విరించి సురాధిప పూజితం
యమ జలేశ ధనేశ నమస్కృతం,
త్రిణయనం భువనత్రితయాధిపం
భజత రే! మనుజా గిరిజాపతిమ్.

---

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0-4-0 | పరమార్థతత్త్వము | 0-12-0 |
| హరినామమహిమ శతకము | 0-4-0 | శ్రీ శుకుడు | 0-12-0 |
| నరసదాసు కీర్తనలు | 0-10-0 | శ్రీ రామనామప్రభావము | 0-6-0 |
| సప్తమహావ్రతములు | 0-6-0 | హిందూకోడ్ బిల్లు సమీక్ష | 1-0-0 |
| ఈశ్వరసాక్షాత్కారము | 0-8-0 | రాధారహస్యము | 1-4-0 |
| శ్రీ సీతారామ శతకము | 0-2-0 | జడభరతుడు | 0-12-0 |
| గీతాప్రతిభ | 0-12-0 | పద్మపురాణం బ్రహ్మఖండం | 1-0-0 |
| భాగవతకథ 1,2,3,4,5,6 భా. | | ,, ఆదిమఖండం | 1-8-0 |
| భాగము 1 కి | 2-0-0 | ,, భూమిఖండం | 2-0-0 |
| శ్రీ త్రిపురాంతకేశ్వరశతకం | 0-4-0 | మహాత్మ ఉపాసనీబాబా | 1-8-0 |
| శ్రీ త్యాగరాజచరిత్ర | 0-4-0 | అర్థపంచకము | 0-12-0 |
| పరమసాధన | 0-12-0 | గోవిందదామోదరస్తోత్రం | 0-8-0 |
| కాళహస్తీశ్వరశతకము | 0-8-0 | భక్తిరసాయనము | 2-0-0 |
| ఆశ్వినమాహాత్మ్యము | 2-0-0 | గీతాకదంబము 1 భా. | 1-4-0 |
| భారతీయతత్త్వశాస్త్రము | 2-0-0 | ,, 2 భా. | 1-4-0 |
| శ్రీరామపూజావిధానము | 0-4-0 | శంకరగ్రంథరత్నావళి | 3-0-0 |
| బదరీయాత్ర | 1-0-0 | భారతీయదర్శనము | 1-8-0 |
| కల్యాణకుంజము | 1-4-0 | *సుందరభారతయాత్ర | 4-0-0 |
| సిద్ధాంతకల్పవల్లి | 1-0-0 | (770 పే. 280 చిత్రములు) | |
| మానవధర్మము | 1-0-0 | తులసీ-గోపూజ | 0-3-0 |
| అష్టాదశశ్లోకగీత | 0-12-0 | ధ్యానపద్ధతి | 0-8-0 |
| అష్టాదశశ్లోకగీత (మూలం) | 0-2-0 | ఉపన్యాసరామాయణము | 0-4-0 |
| భక్తితత్త్వము | 0-12-0 | శివతాండవము | 1-0-0 |
| ముక్తిగీత | 0-6-0 | శ్రీతులసీమహిమామృతము | 1-8-0 |
| గురుశిష్యులు | 1-0-0 | శ్రీ కనకదుర్గానందలహరి | 0-4-0 |
| (రామకృష్ణవివేకానందులు) | | భగవద్గీత (మూలం) | 0-6-0 |
| సంకీర్తనమీమాంస | 1-0-0 | భగవన్నామసంకీర్తన | 0-4-0 |

* ఇదిగాక మిగతా గ్రంథములన్నియును సెట్టుగా తీసికొనిన సగముధరకు యివ్వబడును. ముందుగా రు 10-0-0 లు అడ్వాన్సు పంపవలయును. రైల్వేపార్శిల్ గా తెప్పించుకొనుట మంచిది.

సాధన గ్రంథ మండలి, తెనాలి.